# కామేశ్వరీ వ్రతకల్పము



గ్రంథకర్త :
ఆకొండి రామమూర్తి
కేశనకుర్రు, ఐ. పోలవరం మండలం,
తూర్పుగోదావరి జిల్లా.

# కామేశ్వరీ వ్రతకల్పము



గ్రంథకర్త :

ఆకొండి రామమూర్తి

కేశనకుర్రు, ఐ. పోలవరం మండలం,

# పీఠిక

## ద్విభాష్యం వెంకటసుబ్బయ్య

సీ. కశ్యప కౌండిన్య గౌతమ భరద్వాజ
అత్రి మహర్షుల యన్వయములు
వారిగోత్రంబులై వర్ధిల్లి పుడమిని
శాఖోపశాఖలై జరుగుచుండె
అత్రిసంతతి వార లాత్రేయసన్ గోత్ర
నాములై ఋగ్వేద గాములైరి
ఋగ్యజు స్సామాది రీతులబట్టియే
వేదకర్మంబులు విస్తరిల్లె

గీ. ఇంటిపేరులు కానరావెట్టియెడల
క్రమముగా నాడులెన్నొ యేర్పడుట చేసి
గ్రామనామాలు పౌరుషనామములును
కలిగి యన్వయంబుల పేరులై క్రమతదనరె.

వ. పూర్వమునుండియే సగోత్ర వివాహాదులు నిషేధింపబడినవి. అత్రి సంతతిలోని కొండిక లగుటంజేసి

కం. ఆకొండిక లంచజనిన్
ఆకొండిక లనుచు ననిరి ననగా ననగా
ఆకొండి యయ్యెనయ్యెది
తేకువ వైద్యంబునందు ధీరులువారల్.

వ. వారల మూలపురుషుడు నారాయణుడు నామంబున నొప్పి
భివృద్ధిగావించి వంశము పెరిగినకొలది వేర్వేరు గ్రా

లకు జీవనోపాధియై వలసపోవుటయు కొన్నితరంబుల తదుపరి నారప్పయను నాతడు కేశనకుర్రు గ్రామంబునకు వచ్చి గోదావరీ తీరమగుట నట నివాసంబేర్పరచుకొని వేద వేదాంగ విద్యాసంపన్నుడై నిష్ఠాగరిష్ఠుడై యెల్లరిచేత పూజింపబడుటయే గాక ఆయుర్వేదవైద్య విద్యాపారంగతుండగుట నట భిషగ్వరుండై యెల్లర మన్నన లబడసి గ్రాసవాసంబుల కనువగుమాన్యంబును వసతిని సంపాదించుకొని వ్యవసాయమును వైద్యమును కొనసాగించుచు మిగుల గౌరవప్రపత్తులు కలిగియుండెను. నాటినుండియు వీరు నప్రతిగ్రహీత లగుటయేగాక నిరతాన్నదాతలై అతిథియభ్యాగతుల నాదరించుచు పేరుప్రతిష్ఠల నందియున్నారు. వ్యాసుడు దక్షిణయాత్రచేసిన తఱి కేశనకుర్రుగ్రామమున ప్రతిష్ఠించిన వ్యాసేశ్వరుని నిష్టదైవముగా గ్రహించి యాతని సేవించుటం జేసి ఆకొండివారెల్లరు వ్యాసాకొండియని పిలువంబడిరి. తరువాత యీ నారప్పయను నాయన కామేశ్వరీ దేవినుపాసించి భక్తితో సేవింపగా నాదేవత ప్రత్యక్షమగుటయు నప్పటినుండి యీ ఆకొండివారు కామాకొండియని వాడబడుచుండిరి. నారప్పగారు దన కుమాళ్ళముగ్గురిలో పెద్దవానిని రామయ్య యనియు, రెండవవానిని నారప్పయనియు పిలిచి మూడవవానికి కామేశ్వరిపేరున కామన్నయని పేరిడిరి. రామయ్యగారు తండ్రి కడనే ఆయుర్వేద వైద్య విద్యాభ్యాసముచేసి భిషగ్వరుడై పెద్దాపురం సంస్థానాధీశుల మన్ననలను పొందియున్నారు. వీరు వైద్యమునందేకాక లోకవ్యవహారములందు కూడ మంచినిపుణులు. ఈ రామయ్యగారికి ముగ్గురు కుమారులు. 1. నారప్ప, 2. కామన్న 3. వెంకన్న. వీరిలో నారప్ప

గుడివాడ అగ్రహారీకులు చక్రవర్తులవారి పిల్లను వివాహం చేసియున్నా
నారు. ఆయన కుమాళ్ళు బుచ్చెన్న, వెన్నప్ప, సీతన్న అనువారు
ఈవంశస్థులు గుడివాడ, సాలూరు, బొబ్బిలి, పార్వతీపురం, విజయ
నగరం, కాకినాడ మొదలగు గ్రామములలో నున్నారు. కొందరు
రైల్వేలోను కొందరు గవర్నమెంటులోను ఉద్యోగములలో
నున్నారు. కొందరు ఆయుర్వేద వైద్యవిద్యాప్రవీణులై యున్నారు.
ఇప్పటికిని పోలవరం, పిఠాపురం, ఇంజరం మొదలగు గ్రామము
లలోనున్న ఆకొండి వారిని కామాకొండియనియే యందురు. వేసవ
కుప్రుగ్రామమునగల భూములలోను నివేశనములలోను ఈ ఆకొండి
వారందరకు భాగములుకలిగియున్నవి. క్రమముగా కొందరు విక్ర
యించి యున్నారు. కొందరికింకను భాగములు కలిగియనుభవించు
చున్నారు.

కం. క్రమముగ నావంశమ్మున
ప్రముఖుడు కామన్న భార్యరాజమయుండున్
తమితో బడసెను మువ్వర
రామయ్య, నారప్ప, సీతరామయ్యలనున్.

వ. ఈ రామయ్య వైద్యమున తండ్రితో సమానులై ఆ. పోల
వరం మొదలైన జమీందార్ల మన్ననం బడసియున్నారు.
నారప్పగారు ఉభయభాషాప్రవీణులు. తండ్రిగారియొద్దనే
వైద్యవిద్య నభ్యసించినారు. ఈ నారప్పగారు వేసవకుప్రు
గ్రామమునందే యుండుటంజేసి ఆల్లం రాజువారి పిల్లయగు
పార్వతమ్మ నిచ్చి వివాహముచేసి యున్నారు.

గీ. అరయ నారప్ప నతిపార్వతమ్మయందు
ఒడసెను తనిసు బ్రహ్మణ్యవరు నొకనిని
అంతముందు సీతారామయాఖ్య దత్తు
కొనియె సంతతి తనకులేదనుకొని

వ. సీతారామయ్య దత్తుడు, సుబ్రహ్మణ్యం ఔరసుడు, అయినను ఏకోదరుల కంటె ఎక్కువ సౌభ్రాతృత్వము కలిగి తండ్రిగారి యొద్దనే సాహిత్యము వైద్యం నేర్చుకొన్నారు. ఈసీతారామయ్య గారూనూ వైద్యములో ప్రసిద్ధులై జిల్లెళ్ళవారు కపిలేశ్వరపురం మొదలగు జమీందార్ల మన్ననలు బడసియున్నారు. నారప్పగారు అన్నగారి కుమారుడైన కామన్న రామస్వామిగార్ల కుకూడా ఆయుర్వేద వైద్యమును నేర్పియున్నారు. దత్తుడైన సీతా రామయ్యకు ఇంజరమునగల పుడ్డివారి పెద్ద గవరమ్మ నిచ్చి పరిణయము చేసిరి. కాని వారికి సంతానము కలుగలేదు, సీతా రామయ్య తనకు సంతానము లేదను చింత ఏమాత్రమును పొందక సుబ్రహ్మణ్యమునే తమ్మునిగను కుమారునిగను చూచుకొనుచు వైద్యవిద్య నభ్యసింపజేసి తమ్ముని కేమియు గృహ కృత్యములు చెప్పక తానే నిర్వహించుచు కపిలేశ్వరం జమీం దార్లు మొదలగువారియొద్ద పొందిన బహుమతులను తమ్మునకే చెందచేసినారు. ఆవిశ్వాసమును బట్టియే సుబ్రహ్మణ్యంగారు తన కుమారులలో రెండవవారైన రామమూర్తియందు సీతా రామయ్యగారి యొక్కయు ఆయన భార్య గవరమ్మగార్ల యొక్కయు కర్మకాండలకు కర్తృత్వముంచి ఆయనే కర్మ చేసి నారు. సుబ్రహ్మణ్యంగారి అనంతరం కుమారులు నలుగురై

సంవత్సరముల నుండియు రామమూర్తిగారే వారికి కర్తమై యున్నారు. ఇది సీతారామయ్య సుబ్రహ్మణ్యంగార్ల యొక్క సౌభ్రాతృత్వము తెలుపుటకు మాత్రమే వ్రాయబడినది. వారి సౌభ్రాతృత్వము ఎంతయో కొనియాడదగియున్నది.

గీ. పౌరసుండు సుబ్రహ్మణ్యవరుడు తాను
ఇంజరమ్మున దుడ్డువా రింటిబిడ్డ
పడతి రాజమ్మ భార్యగా బడసె నతడు
దత్తునకు గల్గలేదు సంతతియు నింక.

కం. ఆ సుబ్రహ్మణ్యునకున్
భాసిలె నారాయణుండు ప్రథమసుతుండై
చేసినఫలముల తదుపరి
వాసిగసగ రామమూర్తి వరుడుపయించెన్.

వ. అందు నారాయణమూర్తి కేశనకుర్రుసనున్న అల్లంరాజు వారి బిడ్డ సూరమ్మను వివాహమై ఆమె యందు సుబ్రహ్మణ్యం, సీతా రామమూర్తి, అను నిర్వురపుత్రులం బడసె. కాలక్రమమ్మున భార్యావియోగమ్మగుట నారాయణమూర్తి నిష్ఠాగరిష్ఠుడై జప తపాదులు దేవతార్చన నైవేద్యాదులు జరిగించుచు శిష్టాచార సంపన్నులైయుండిరి. పుత్రులకు పుత్రికలకు వివాహాది శుభ కార్యములుచేసి వ్యవసాయాది సమస్తవిషయమ్ములు పుత్రుల కప్పగించి తాను నిమిత్తమాత్రుండై తన దేవతార్చనాది నిత్య కృత్యములు జరిగించుకొనుచు దైవచింతతో కాలక్షేపము చేయు చున్నారు.

అతని కుమారుడగు సుబ్రహ్మణ్యమునకు నారాయణమూర్తి, కలికి కామేశ్వరశర్మ అనుపుత్రులు కలిగిరి. సీతారామమూర్తి కింతవరకుసంతతి కలుగలేదు. సుబ్రహ్మణ్యంగారి రెండవకుమా

[illegible]
కుమార్తెయైన చంద్రమ్మ యనునామెను వివాహమై ఆమెయందు ఏవురు పుత్రులని ఇద్దరు పుత్రికలను బడసినారు. సంతానము యొక్కయు వివాహాది శుభశోభనములెల్ల జరిగించి విశ్రాంతి గొనుచు నిష్ఠాగరిష్ఠులై నిత్యనైమిత్తికములను దేవతార్చన నైవేద్యాదులను జరిగించుచు అతిథిఅభ్యాగతుల నాదరించుచున్నారు. వీరు కామేశ్వరీ భక్తులు. వీరి యింట శుభకార్యములు జరిగినపుడు, దేవీ అనుగ్రహము కొరకు కామేశ్వరీవ్రతము యథావిధిగ విధ్యుక్తముగ కల్పోక్తముగ నొనరించుచుందురు. కామేశ్వరీ వ్రతము మిగుల నిష్ఠతో చేయవలసియున్నది. కామేశ్వరీదేవి సకలైశ్వర్యములు కలుగజేయు కరుణామూర్తి, ఆగ్రహానుగ్రహములు రెండునుకలదేవి. సదాచారముగ జరుగనిచోటః నామెయెంతయు యుగ్రరూపము ధరించును. కామేశ్వరీ వ్రతవిధానము, కథ, పాట మొదలగునవి ఎచ్చటనోగాని లేవు. అవియూ శుద్ధములు కావు. మున్ముందు తనవంశములోని వారుగాని మరియెవ్వరుగాని కామేశ్వరీవ్రతము విధ్యుక్తముగ కల్పోక్తముగ చేసికొనుటకు శ్రీదేవియనుగ్రహము పొందుటకు శ్రీరామమూర్తిగారు కామేశ్వరీవ్రతమును, కథను పాటను వ్రాసి అచ్చొత్తించినారు. శ్రీరామమూర్తిగారికి సీతారామస్వామి, కామేశ్వరశాస్త్రి, సుబ్రహ్మణ్యం, సూర్యనారాయణమూర్తి విశ్వనాథశర్మ అను ఐదుగురు కుమాళ్ళు కలరు. వారిలో సీతారామస్వామికి రామమూర్తి, సూర్యజగన్నాథం అను ఇద్దరు కుమాళ్ళును; కామేశ్వరశాస్త్రికి రామమూర్తి, కామేశ్వరరావు, రామభద్రుడు అను మువ్వురు కుమారులను; సుబ్రహ్మణ్యమునకిద్దరు కుమార్తెలును; సూర్యనారాయణమూర్తికి రామమూర్తి, సుబ్రహ్మణ్యం, వెంకట సత్యభాస్కర శ్రీవిజయకామేశ్వరీరాజేష్‌లను ముగ్గురు కుమారు

లును; విశ్వనాథశర్మకు రామలింగస్వామి యను కుమారుడు ఇట్లు తామరతంపరగా పెరుగుచున్న ఆకొండివంశమును కుల దేవతయగు కామేశ్వరీదేవి సకలశుభములు నైశ్వర్యములనిచ్చి సదా రక్షించుగావుత।

గ్రంథకర్త శ్రీ ఆకొండి రామమూర్తిగారు నాకువియ్యంకులు. వారి రెండవకుమార్తెయగు చి॥సౌ॥ వెంకటగౌరీరత్నమును నా రెండవకుమారుడగు చి॥ బంగారేశ్వరశర్మకు ఇచ్చి వివాహము వైభవోపేతంగా జరిగించినారు. విశేషించి వీరు మాఅత్తగారికి మేనమామగారి కుమారులు.

శ్రమకోర్చి వీరు వ్రాసిన కామేశ్వరీ వ్రతకల్పము ఎంతయో ఫలప్రదమైనది. ఇందువేరుగా వీరు పొందుపరచిన అష్టకాదులు నిత్యము పఠనీయములు.

తమకొఱకు లోకముకొఱకు ఈగ్రంథము నిట్లు ప్రకటించిన శ్రీరామమూర్తిగారికి కామేశ్వరీదేవి ఆయురారోగ్య భోగభాగ్యం లనిచ్చి సర్వదా రక్షించుగాక! లోకోపయోగము, ఆస్తికత్వము పెంపొందును. ఇట్టిగ్రంథములు వీరింకను రచియించి లోకమున కందజేయుదురు గాక! వారికి నేను నా అంజలులను సమర్పించు కొనుచు ఈపీఠికను వ్రాయుటకు నాకవకాశము కలిగినందులకు మరియొకమారునమస్కరించుచువిరమించుచున్నాను. కామేశ్వరీ కటాక్షముననే దీనిని వ్రాయగల్గితినని యుద్ఘాటించుచున్నాను.

ఇట్లు
విధేయుడు
ద్విభాష్యం వెంకట రమణయ్య

హైదరాబాదు
11-3-1981

నారప్పగారికుమారుడు సుబ్రహ్మణ్యం, సీతారామయ్యగార్లు ఉభయులూ పేహారుగ్రామ వాస్తవ్యులు. మధ్వులు, జమీందార్లు జిల్లేళ్ల ఖానోజీపంతులు. కపిలేశ్వరపురం జమీందార్లగు బలుసు రామలక్ష్మమ్మగార్ల దివాణములలో వైద్యము చేయుచూ వారివల్ల అనేక సత్కారములు పొందుచూ వారి మన్ననలకు పాత్రులైరి.

ఇందలి అష్టకములు, స్తవములు, శ్రీ ఆకొండి సీతారామయ్య గారిచే రచింపబడినవి.

మా శ్రీకామేశ్వరీ పరదేవత గురించి........

శ్రీమత్కామేశ్వరీందేవీం సర్వసిద్ధి ప్రదాయినీం
కరుణారస సంపూర్ణం వందేమత్కుల దేవతామ్
కామేశ్వరీ మహం వందే మనోభీష్ట ప్రదాయినీం
శ్రీగౌరీం వాక్స్వరూపాం తాం భక్తానుగ్రహ తత్పరాం

శ్రీకామేశ్వరీదేవి మాకు కులదైవం ఆచల్లని తల్లి కరుణా కటాక్ష వీక్షణాలు మమ్ములను ఎపుడూ కాపాడుతూ ఉంటాయి. తరుచుగా ఆమెను మేము కొలుచుకొంటూ ఉంటాం. ఆ కొలువులో ఆమాత కొలువుతీర్చి ఉన్నట్లు ఎన్నో నిదర్శనాలు మాకు కనిపిస్తూ ఉంటాయి. మాకు ఆమె యెడల ఎంతో నమ్మకం.

ఆకొండివారు ఆనువంశిక ఆయుర్వేద ప్రసిద్ధ వైద్యులు, ఆకొండాయ అనువారి నుండి ఈ వైద్యము ఆనువంశికముగా వచ్చుచుండుటచే ఆకొండివారు అను ఇంటిపేరు ఏర్పడినట్లు పూర్వుల మాట.

క్రమాగతముగ నారప్ప అనువారు సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు ఎక్కడికెక్కడికో జమిందారీల ఆస్థానములకు వైద్యం నిమిత్తం వెడుతూ ఉండేవారు వీరు ఒకసారి ఒక ఆస్థానానికి వైద్యం నిమిత్తం వెడుతున్నారు. అప్పట్లో వీరి వాహనాలు పల్లకీలే, ఆ పల్లకీలో వెళుతూ ఉండగా బోయీలు శ్రమ నివారణకు ఒక చెరువు గట్టున పల్లకీ దింపి దాహం తీర్చుకోవడానికి చెరువుకు వెళ్ళినారు. ఈలోగా నారప్ప గారికి మాగన్నుగా కునుకు పట్టినట్లయింది. ఆకునుకులో దివ్యాలంకార శోభితమైన ఒక కన్యక కనపడింది. శ్రీనారప్పగారు ఆశ్చర్యపడి అమ్మా! నీవెవరవు, ఇచట నొంటిగా నుంటివేమి అని ఆకునుకులో ప్రశ్నించగా, అపుడామె చిరునవ్వుతో నాయనా! నేను కామేశ్వరీ అను దేవతను నీవా దైవభక్తి సంపన్ను

డవు, పరోపకార పరాయణుడవు కావునసీకు పత్యసమిచ్చినాను. నీవు రాజాస్థానమున వైద్య నిమిత్తం వెళ్ళుచున్నావు కదా! ఆరోగికి తక్షణమే సంపూర్ణ ఆరోగ్యము కలుగును అక్కడ నీకు మంచి సన్మానము జరుగును. అక్కడ వారి ఆటుకపై పాతబడిన రెండు టేకుల స్తంభములున్నాయి. నిన్ను వారు సత్కరించు సమయమున ఆటేకుల స్తంభాలను కూడా అడిగి పుచ్చుకుని తెచ్చి మీఊరు చెరువు గట్టు పై నున్న ఒక వేప చెట్టుకింద ఆ టేకుల స్తంభము లను నిలిపి నన్ను మీ కులదేవతగా భక్తితో కొలుచుచుండవలెను. నాయెడల భక్తికి సూచకముగా మీవంశమునందలి ప్రథమ సంతానా నికి నాపేరు పెట్టుకొనుడు మీ వైద్యమునకు నేనెల్లప్పుడూ వన్నె తెచ్చుచూ వంశక్షేమమును కాపాడుతూ ఉంటానని చెప్పి అంతర్హిత మగుచుండగా నారప్పగారు భయభక్తి వినయములతో ఆమె పాద ములపై పడి సాష్టాంగనమస్కారము చేసి, అమ్మా! నీమాటలయందు నాకు నమ్మకమున్నది కాని నీవు నిజముగా కామేశ్వరివి అయినట్లు నాకు మరియొక నిదర్శనమును చూపింపకోరిక నేనిట్లు అడిగినందు లకు క్షమింపుమని ప్రార్థించెనట. అదివిని కామేశ్వరి నీవిపుడుపల్లకిపై పోవనుంటివికదా! బోయలు వచ్చిన తరువాత నీవు ముందువైపున నున్న పల్లకిదండిని మాత్రమే బోయలచే నెత్తింపుము. వెనుక దండిని బోయలుమోయనక్కర లేకుండగనే నీపల్లకి నడిపించెదను. అపుడు నీసందేహము తీరగలదు. అని అంతర్ధాన మొందినదట. నారప్పగారుమెలకువ తెచ్చుకొని ఇది అంతయు నిజమా అని అను కొన్నంతలోబోయలు వచ్చిరి. వారిని ముందువైపు మాత్రమే పల్లకి ఎత్తుటకు చెప్పెను. అపుడు కామేశ్వరీ ప్రభావముచే వెనుక వైపు బోయలుఅక్కర లేకుండగనే పల్లకీ లేచెనట. ఆవిధముగా పదిబారల దూరంనడిచిన తరువాత శ్రీకామేశ్వరికి నమస్కరించుకొని, యథా పూర్వముగా బోయలచే పల్లకిమోయించుకొని గమ్యస్థానమునకేగిరి. అక్కడి వారికి మంచి ఆరోగ్యం కలిగినది. వారు నారప్పగారిని సత్కరించిరి. అపుడు నారప్పగారు కామేశ్వరీమాత చెప్పినట్లు



శ్రీ దత్త కామేశ్వరీ ఉపాసకులు
మరియు ఆయుర్వేద వైద్యులు
డా॥ ఆకొండి కామేశ్వర శాస్త్రి, RMP, శ్రీమతి వెంకట రత్న

ఎనిమిది స్త్రీవిగ్రహాలు, రెండు పురుషవిగ్రహాలు ఉన్నవట. వాటిని నారప్పగారు అతి జాగ్రత్తగా తీసుకొని వచ్చి శ్రీకామేశ్వరీదేవి చెప్పిన విధముగా కేశనపుర్రులో చెరువుగట్టు మీద ఉన్న వేపచెట్టు క్రింద కామేశ్వరీ ప్రతిష్ఠ చేసిరట. అదిమొదలు ఈ ఆకొండివారి యింట ఏశుభమునైనా, ఎక్కడ గొప్ప సన్మానములు పొందినా కామేశ్వరిని కొలుచు ఆచారంగా నేటికినీ అవిచ్ఛిన్నంగా జరుగుతుంది, నారప్పగారు తనకు కలిగిన సంతానానికి కామయ్య అని పేరు పెట్టిరి. అప్పటి నుండియే కామాకొండివారు అనుపేరు వచ్చియుండెనట.

మావంశవృక్షమునందుకూడ ఈకథను బట్టి అప్పటినుండియే వారివారి సంతానములకు కామేశ్వరీదేవి పేర్లు కన్పించుచున్నవి. ఈ నారప్పగారు బహుశః 14, 15 శతాబ్దములలో ఉన్నారు. కొన్ని చరిత్రాధారముల ననుసరించి 14, 15 శతాబ్దముల మధ్య కాలములోని వారని అనుకొనవచ్చును.

శ్రీకామేశ్వరీ కొలుపు ఒక ప్రత్యేక పద్ధతిగా ఉంటుంది. ఆ పద్ధతి వ్రాతప్రతులలోనే ఉన్నందున, దానిని అందరికి అందించాలని కేశనపుర్రు వాస్తవ్యులు మా కీ॥శే॥ రామమూర్తి తాతయ్యగారు ఒక పుస్తక రూపంలో అచ్చు వేయించారు. అది చాల ఉపయోగములో నున్నది.

కీ॥శే॥ రామమూర్తి తాతయ్యగారి రెండవ కుమారులు కామేశ్వర శాస్త్రిగారు. వీరు దేవీకామేశ్వరీ ఉపాసకులు. ప్రతి సంవత్సరం శరన్నవరాత్రాలలో కామేశ్వరీ ఉపాసన చేస్తూ, దేవీ నవరాత్ర ఉత్సవాలు జరిపిస్తూ ఉంటారు.

కామేశ్వరీ ఆలయం మన ప్రాంతంలో ఎక్కడాలేదు. విజయ నగరం జిల్లా చౌదంతివలసలోమాత్రంయున్నట్లు వినికిడి. దర్శనం చేసుకున్నవారునూయున్నారు. మనప్రాంతానికి ఈలోటు తీర్చాలని కామేశ్వరశాస్త్రిగారు సంకల్పించారు. చాల శ్రమించారు. కొత్తలంక వాస్తవ్యులు భమిడి కనకసూర్యరామచంద్రశాస్త్రిగారు వారి కుటుంబము కామేశ్వరీ ఆరాధకులు. వారితో మా కామేశ్వర శాస్త్రిగారు ప్రస్తావించి, ప్రోత్సహించినారు.

కేశనకుర్రులోనే చెరువుగట్టు వద్దగల శ్రీసుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి ఆలయంలో శ్రీకామేశ్వరీదేవి విగ్రహమును శాస్త్రోక్తముగా ది. వి. **3-5-1996** న ప్రతిష్ఠించినారు. కామేశ్వరీ ఆరాధకులందరకు చాల సంతోషము కలిగించినారు. కామేశ్వరీ పూజ చేసుకొనుటకు, దర్శించుటకు ఒక ప్రత్యేక స్థానాన్ని కల్పించారు. శ్రీతిరుమల తిరుపతి దేవస్థానం వారితో సంప్రదించారు. ఈపుస్తక ముద్రణకు తిరుపతి దేవస్థానమువారు సంపూర్ణ సహకారం అందించినారు. మా కామేశ్వరశాస్త్రిగారు కామేశ్వరీమాతకు చేసిన సేవకు, భక్తులకు అందించిన సౌకర్యమునకు కామేశ్వరీ ఆరాధకులందరకు చాల అభినందనీయులు.

కామేశ్వరీమాత సమస్త విశ్వమునకు సమస్త సన్మంగళములను ప్రసాదించు గాక!

ఆయుర్వేదాచార్య
ఆకొండి సత్యనారాయణశాస్త్రి
శ్రీ కామేశ్వరీ ఆయుర్వేద సంస్థానము
ఐ. పోలవరం.

శ్రీ మహాగణాధిపతయే నమః

# కామేశ్వరీ వ్రతకల్పము

కేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా, మాధవాయ స్వాహా... హరే శ్రీకృష్ణాయ నమః ఓం పృథివ్యాః మేరుపృష్ఠ ఋషిః... ఓం భూః, ఓం భువః, ఓం స్వః, ఓం మహః, ఓం జనః ఓం తపః, ఓం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్ ... ఓ మాపోజ్యోతి రసోమృతం బ్రహ్మ భూ ర్భువ స్సువ రోమ్ మమ ఉపాత్త దురితక్షయద్వారా, శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం, శుభే శోభనే ముహూర్తే, శ్రీమహావిష్ణో రాజ్ఞయా ప్రవర్త మానస్య, అద్యబ్రహ్మణః, ద్వితీయ ప్రార్థే, శ్వేతవరాహ కల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన .. నామ .. సంవత్సరే ... ఆయనే .. ఋతౌ ... మాసే ... పక్షే ... తిథౌ ... వాసరే శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణ, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ ... గోత్రః ... నామధేయః ధర్మపత్నీ సమేతోహం, శ్రీమతః ... గోత్రస్య ... నామధేయస్య, ధర్మపత్నీ సమేతస్య, సకుటుంబస్య, సభ్రాతృకస్య, సపుత్రకస్య, సబాంధవస్య, సాశ్రిత వర్గస్య, మమ, క్షేమస్థైర్య, విజయ, అభయ, ఆయురారోగ్యైశ్వర్యాభివృధ్యర్థం, ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థసిద్ధ్యర్థం పుత్రపౌత్రాభి వృధ్యర్థం, సకలశ్రేయోభి వృధ్యర్థం, శ్రీమత్కామేశ్వరీదేవతాముద్దిస్య, శ్రీమత్కామేశ్వరీ దేవతా ప్రీత్యర్థం, సంభవిద్భిర్ద్రవ్యైః, స్సంభవిద్భిరుపచారైః,

స్సంభవితానియమేన యావచ్ఛక్తిధ్యాన ఆవాహనాది షోడశోప చారపూజయాచ, శ్రీ సూక్తకల్పోక్త ప్రకారేణ, ఆత్మబాంధవైస్స హితః కరిష్యే ॥ తదంగ నిర్విఘ్న పరిసమాప్త్యర్థం గణాధిపతి పూజాం కరిష్యే ॥ గణాధిపతి పూజాం కృత్వా ॥ పునః ప్రాణా నాచమ్య॥ కేశవాయస్వాహా ... శ్రీకృష్ణాయ నమః॥ పృథివ్యాహ మేరుపృష్ఠఋషిః ... ఓంభూః, ఓంభువః, ఓంస్వః, ఓంమహః, ఓం జనః, ఓంతపః, ఓం సత్యం, ఓంతత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్య ధీమహీ, ధియో యో నః ప్రచోదయాత్ ॥ ఓ మాపోజ్యోతీరసో మృతం బ్రహ్మభూర్భువ స్వరోమ్॥ మమ, ఉపాత్తదురితక్షయ ద్వారా, శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం, శుభేశోభనే ముహూర్తే, శ్రీ మహావిష్ణోరాజ్ఞయా, ప్రవర్తమానస్య, అద్యబ్రహ్మణః, ద్వితీయ్య ప్రార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, అస్మిన్వర్త మానవ్యావహారిక చాంద్రమానేన . నామసంవత్సరే అయనే .. ఋతౌ ... మాసే .. పక్షే తిథౌ ... వాసరే, శుభనక్షత్రే, శుభ యోగే, శుభకరణ, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ, శ్రీమతః ... గోత్రస్య .. నామధేయస్య .. ధర్మపత్నీసమేతస్య, శ్రీమాన్ .. గోత్రః ... నామధేయః ... ధర్మపత్నీ సమేతోహం, సకుటుంబస్య, సభ్రాతృకస్య, సపుత్రకస్య, సబాంధవస్య, సాశ్రిత వర్గస్య మమ క్షేమస్థైర్య, విజయ, అభయ, ఆయురారోగ్యైశ్వర్యాభి వృధ్యర్థం, ధర్మార్ధకామమోక్ష చతుర్విధ ఫల పురుషార్థసిధ్యర్థం, పుత్రపౌత్రాభి వృధ్యర్థం సకల శ్రేయోభి వృధ్యర్థం॥ శ్రీమత్కా మేశ్వరీదేవతా ముద్దిస్య, శ్రీమత్కామేశ్వరీ దేవతాప్రీత్యర్థం సంభ విద్భిర్ద్రవ్యైః, స్సంభవిద్భిరుపచారైః, సంభవితా నియమేన యావ చ్ఛక్తిధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయాచ, శ్రీ సూక్త కల్పోక్త ప్రకారేణ, ఆత్మబాంధవైస్స హితః కరిష్యే॥ తదంగ

కలశారాధనం కరిష్యే॥ కలశస్య ముఖే విష్ణుః కంఠేరుద్ర స్సమా శ్రితః మూలే తత్ర స్థితో బ్రహ్మా మధ్యే మాతృగణాస్మృతాః కుక్షౌ తు సాగరా స్సర్వేసప్త ద్వీపా వసుంధరా, ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః. అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః" (కలశే గంధపుష్పాక్షతా న్నిక్షిప్య, హస్తే నాచ్ఛాద్య) ఆకలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే. ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే అపోనా ఇదగ్ంం సర్వం విశ్వాభూతా న్యాపః ప్రాణా వాత: పశవ ఆపోఽన్న మాపోఽమృత మాపః సమ్రాడాపో విరాడాప స్వరాడాప శ్ఛందాగ్ం స్యాపో జ్యోతీగ్ంష్యాపో యజూగ్ంష్యాప స్సత్యమాప స్సర్వాదేవతా ఆపో భూర్భువ స్సువరాప ఓమ్॥ గంగే చయమునే కృష్ణే గోదావరి సరస్వతి, నర్మదా సింధు కావేరి జలేస్మిన్ సన్నిధింకురు. ఆయాంతు శ్రీకామేశ్వరీ దేవతాపూజార్థం దురితక్షయ కారకాః - కలశోదకేన దేవ మాత్మానం పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య॥ గృహస్యోత్తర దిగ్భాగే గోమయోపలిప్త రంగవల్ల్యాద్య ద్యలంకృత్య దివ్యపీఠికాయాం తండు లానా స్తీర్య - తత్ర-

"స్యోనాపృథివిభవాన్యృక్షరా నివేశనీ, యచ్ఛానశ్శర్మ సప్రథాః" (ఈ మంత్రముతో భూమిని స్పృశింపవలెను.) ఇమం వస్త్రాక్షిపిపసావసాధే ఇవోరచ్ఛిద్రామంత్రవోహ సర్గాః ఆవాతిరత మన్నతానివిశ్వ దేసమిత్రావరుణాసచేధే" (ఈ మంత్రముతో మంటప వస్త్రమును స్పృశించవలెను.)

ఓషధయ స్సంవదంతే సోమేనసహరాజ్ఞా యస్మైక రోతి బ్రాహ్మణ స్తగ్ంం రాజన్ పారయామసి" (ఈమంత్రముతో బియ్య మును స్పృశించవలెను.)" ఆకలశేషుధావతి పవిత్రే పరిషిచ్యతే ఉక్థైర్యజ్ఞేషువర్ధతే" (ఈమంత్రముతో మంటప మధ్యస్థానమున

సుతుద్రిస్తోమగ్ంసచ తాపరుష్ణియా అసిక్న్యా మరుద్వృధే వితస్త
యార్జీకీయే శృణుహ్యా సుషోమయా" (ఈమంత్రముతో కలశలో
నీరుపోయవలెను) "యాఃఫలినీర్యా అఫలా పుష్పా యాశ్చపుష్పిణీః
బృహస్పతి ప్రసూతాస్తానోముంచంత్వంగ్ంహసః" (ఈమంత్ర
ముతో కలశపై వొలిచిన కొబ్బరికాయ ఉంచవలెను.) "ఇమం వస్త్రం
జీపీవసా దసాధే ఇవోరచ్ఛిద్రామంత్ర వోహసర్గః ఆవాతిరతి
మన్మటోనివిశ్వ త్రేసమిత్రా వరుణాసచేథే సుమంగలీ రియం
వధూరిమాగ్ం సమేతవస్త్రితా, సౌభాగ్యమస్యైదత్వా యాదా
స్తంవిపరేతిన" (ఈమంత్రముతో కొబ్బరికాయపై రవికల గుడ్డ
ఉంచవలెను.) "తతః ప్రతిమాశోధనం కరిష్యే" అప్మాయ
స్వసమేతు తేవిశ్వతస్సోమవృష్ణియంభవావాజస్య సంగథే, దధిక్రా
వ్ణో అకారిషం. జిష్ణో రశ్వస్య వాజినః సురభినోముఖా కరత్ప్రణ
ఆయూంగ్షి తారిషత్, శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవో వస్సవి
తోత్పునా, త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసో స్సూర్యస్య రశ్మిభిః,
మధువాతాఋతాయతే మధు క్షరంతి సింధవః మాధ్వీర్నస్సంత్వోషధీః
మధు నక్తముతోషసి మధుమత్పార్థివగ్ంరజః, మధుద్యౌరస్తునః
పితా, మధుమాన్నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తుసూర్యః మాధ్వి
ర్గావోభవంతునః స్వాదుఃపవస్వదివ్యాయ జన్మనేస్వాదు రింద్రాయ
సుహవేతు నామ్నే స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహ
స్పతయే మధుమాగ్ం అదాభ్యః" (శ్రీ మహాకామేశ్వరిప్రతిమను
గాని అదిలేనిచో ఒకరాగినాణెమునుగాని ఒకతమలపాకులో ఉంచి
దానిని ఎడమ అరచేత ఉంచుకొని కుడిచేతిలో ఆ ప్రతిమని పై
మంత్రములతో (అనగా) పంచామృతములచే మార్జన చేయ
వలయును. తరువాత ఆ ప్రతిమనుతుడిచి, దానిపై మంచి గంధము,
కుంకుమ, ఆ ప్రతిమకు ఉంచి కుడిచేతితో మూసి ఈ క్రింది మంత్ర
మును పఠించవలెను.) "అసునీతే పున రస్మాసు చక్షుః పునః ప్రాణ

మిహనో ధేహిభోగం, జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరంత మనుమతే
మృడయానస్వస్తి అమృతంపై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ
యథాస్థాన ముపహ్వా యతే" స్థిరోభవ, వరదోభవ, సుముఖోభవ,
సుప్రసన్నోభవ, స్థిరాసనం కురు. శ్రీమత్కామేశ్వరీదేవతా ప్రాణ
ప్రతిష్ఠాపన ముహూర్త సుముహూర్తో అస్తు, శ్రీమత్కామేశ్వరీ
దేవతాస్థాపయామి పూజయామి అథధ్యానం ॥శ్లో॥ ధ్యాయే
త్కామేశ్వరీం దేవీం భక్తాభీష్ట ప్రదాయినీం, శ్రీకంఠశూల కలితర
సన్తోయకృతోదయాం, పార్వతీసయనోద్భూతాం పరానంద
ప్రదాయినీం సోదరీసోదరయుతాం సురాసుర నమస్కృతాం
సువాసిన్యర్చనప్రీతాం శోభనాం శుద్ధమానసాం కుశలాం కోమలా
కారాం కూటస్థాం కులదేవతాం ॥ శ్రీమత్కామేశ్వరీదేవతాయైనమః
ధ్యానం సమర్పయామి" ॥శ్లో॥ ఆవాహయామి కామేశీం సాంగాం
సపరివాహకా, భక్తాభీష్టప్రదామిష్టదేవతాం భువనేశ్వరీం హిరణ్య
వర్ణాం హరిణీ = జాతవేదోమమావహ ॥౧॥ శ్రీమత్కామేశ్వరీ
దేవతాయైనమః" ఆవాహనం సమర్పయామి ॥శ్లో॥ అనర్ఘ రత్న
ఖచిత మాసనం స్వర్ణభానురం, దాసోహం తే ప్రదాస్యామి
భానురాంగి కులేశ్వరి తాంమఆవహదేతవేదో = గామశ్వమ్పురుషా
నిహమ్ ॥౨॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయైనమః రత్నసింహాసనం
సమర్పయామి॥ ॥శ్లో॥ సుగంధ పుష్పసహితం సర్వతీర్థ సమా
హృతం పాద్యంగృహాణ కామేశి భక్తాభీష్టఫలప్రదే; అశ్వపూర్వాం
రథమధ్యాం = శ్రీర్మాదేవజుషతామ్ ॥౩॥ శ్రీమత్కామేశ్వరీదేవతా
యై నమః పాద్యం సమర్పయామి ॥శ్లో॥ వాసితం కుచిరం శుద్ధం
భాసురం పావనం శుభం, అర్ఘ్యం దాస్యామి తే దేవి కామేశ్వరి
కులేశ్వరీ ॥ కామ్‌సోస్మితాం = న్తామిహోపహ్వయే శ్రియం ॥౪॥
శ్రీమత్కామేశ్వరీదేవతాయై నమః అర్ఘ్యం సమర్పయామి ॥శ్లో॥
సువర్ణకలశానీతం చందనాదిభి రన్వితం గృహాణాచమనం దేవి

కామేశ్వరి మయార్పితం॥ చంద్రాం ప్రభాసాం = అలక్ష్మీర్మేనశ్య
తాన్త్వాం వృణే ॥౫॥ శ్రీమత్కామేశ్వరీదేవతాయైనమః ఆచమనీయం
సమర్పయామి ॥శ్లో॥ దధిక్షీర సమాయుక్తం, మధుసర్పిసమన్వితం
మధుపర్కం గృహాణేదం, విధుసూర్యాగ్నిలోచనే, శ్రీమత్కామే
శ్వరీ దేవతాయైనమః మధుపర్కం సమర్పయామి. ॥శ్లో॥ దధిక్షీర
ఘృతోపేతం శర్కరా మధుసంయుతం, పంచామృతస్నాన మిదం
స్వీకురుష్వ మహేశ్వరి॥ ఆప్యాయస్వసమేతుతే విశ్వతస్సోమ వృష్ణి
యంభవావాజస్యసంగధే, ఇతిక్షీరం దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణో
రశ్వస్యవాజినః, సురభినో ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషితారిషత్॥
ఇతి దధి॥ శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవస్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః ఇతి ఆజ్యం
మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః మాధ్వీర్నస్సన్త్వోషధీః
మధునక్తముతోషసి మధుమత్పార్థివగ్ంరజః మధుద్యౌరస్తు నః
పితా మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తుసూర్యః మాధ్వీ
ర్గావో భవంతు నః ఇతిమధు స్వాదుః పవస్వదివ్యాయజన్మనే
స్వాదురింద్రాయసుహవేతు నామ్నే స్వాదు ర్మిత్రాయ వరుణాయ
వాయవే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః ఇతిశర్కరా
శ్రీమత్కామేశ్వరీ దేవతాయైనమః పంచామృతస్నానం సమర్ప
యామి, ॥శ్లో॥ బ్రహ్మాండభాండమధ్యస్థైస్తీర్థైః శ్రీగంధమిశ్రితైః,
స్నాపయిష్యా మ్యహం భక్త్యా గృహాణ గిరిజాక్షిదే, ఆదిత్యవర్ణే
తపసోధిజాతో = మాయాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ॥౬॥ శ్రీ
మత్కామేశ్వరీ దేవతాయైనమః స్నానం సమర్పయామి. ॥శ్లో॥
పూర్ణచంద్రాననే దేవి కోటిసూర్యసమప్రభే, కామేశ్వరీ గృహాణేదం
శుద్ధమాచమనీయకం అపోహిష్ఠా మయోభువః ... యస్యక్షయాయ
జిన్వథ ఆపోజనయథాచనః॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయైనమః

సమర్పయామి॥ ॥శ్లో॥ పీతాంబరద్వయం నూత్నం మృదులం కుల
దేవతే, కామేశ్వరి మయాదత్తం సంప్రీత్యా ప్రతిగృహ్యతాం॥
ఉపైతు మాన్దేవసఖః... కీర్తిమృద్ధిందదాతుమే॥౭॥ శ్రీమత్కామే
శ్వరీ దేవతాయైనమః వస్త్రయుగ్మం సమర్పయామి॥ శ్లో॥ తప్త
కార్తస్వరకృతం ముక్తామణివిభూషితం, ఉపవీతమిదం దేవి గృహాణ
కులదేవతే॥ క్షుత్పిపాసామలాజ్యేష్ఠా.. నిర్ణుదమేగృహాత్ ॥౮॥ శ్రీ
మత్కామేశ్వరీ దేవతాయైనమః ఉపవీతం సమర్పయామి॥ శ్లో॥
హారమంజీరకేయూర మేఖలాధీన్యభీష్టదే, విభూషణాని మాల్యాని
రత్నాని ప్రతిగృహ్యతాం॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయై నమః,
సర్వాభరణాన్ సమర్పయామి ॥ శ్లో॥ చందనాగరు కస్తూరీ
కుంకుమాదిభి రన్వితం, గంధం గృహాణ వరదే కామేశ్వరి
కృపానిధే॥ గంధద్వారా దురాధర్షాం.. ఇహోపహ్వయే శ్రియం
॥౯॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయైనమః, దివ్యశ్రీచందనం సమ
ర్పయామి॥ శ్లో॥ అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలితండుల కల్పి
తాన్, హరిద్రాకుంకుమోపేతాన్ స్వీకురు త్వం శివాత్మజే॥ శ్రీమ
త్కామేశ్వరీ దేవతాయైనమః అక్షతాన్ సమర్పయామి॥ శ్లో॥
సంపంగివరాబ్జ పున్నాగ కరవీరోత్పలాదిభిః, కల్పితాని చ మాల్యా
ని గృహాణాసుర పూజితే॥ మనసః కామమాకూతిం మయి శ్రీ
శ్రయతాం యశః ॥౧౦॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయైనమః, అథ
పుష్పాణి పూజయామి॥ అథ అంగపూజ॥ విబుధ వందితాంఘ్రియై
నమః॥ పాదౌ పూజయామి॥ కామదాయైనమః॥ జంఘే పూజయామి॥
కామాక్ష్యై నమః॥ జానునీ పూజయామి॥ సుందర్యై నమః ఊరూ పూజ
యామి॥ కమలవాసిన్యైనమః॥ కటిం పూజయామి॥ గంభీరనాభియై
నమః॥ నాభిం పూజయామి॥ జగన్మాత్రేనమః॥ స్తనౌ పూజయామి॥
లలితాయై నమః॥ భుజద్వయం పూజయామి॥ కంబుకంఠ్యై నమః॥

పూజయామి॥ కమలాక్ష్యై నమః॥ నేత్రే పూజయామి॥ శ్రీకర్ణాయైనమః
కర్ణౌ పూజయామి॥ కాంతాయైనమః॥ శిరః పూజయామి॥ శ్రీమతా
మేశ్వర్యైనమః॥ సర్వాణ్యంగాని పూజయామి॥

## —: అష్టోత్తర శతనామపూజా :—

ఓమ్ శ్రీ మత్యై నమః
ప్రకృత్యై నమః
విద్యాయై నమః
శ్రద్ధాయై నమః
వాచేనమః
ఓమ్ శుచయేనమః
ఆంబికాయై నమః
పార్వతీనేత్రశంభూతాయై నమః
భక్తకారనసముద్యతాయైనమః
స్వాహాయైనమః 10
ఓమ్ స్వధాయై నమః
మహాలక్ష్మ్యై నమః
వసుధాయైనమః
కులదేవతాయై నమః
సర్వభూతిహితాయై నమః
కాంతాయై నమః
కామేశ్వర్యై నమః
కమలాలయాయై నమః
కామాక్షిణ్యై నమః
కలిదోషఘ్న్యై నమః 20
అన్నదాయై నమః

ధనదాయై నమః
అనఘాయై నమః
అశోకాయై సమః
దీప్తయై నమః
అమృతాయై నమః
లోకశోకవినాశిన్యై నమః
త్రిశూలకుండాంబుజాతాయైనమ
జ్యేష్ఠాసప్తకసంయుతాయై నమ
కనిష్ఠద్వయసంయుతాయైనమః 3
ఓమ్కామిన్యై నమః
కామదాయై నమః
వరారోహాయైనమః
పద్మహస్తాయై నమః
పద్మమాలాధరాయై నమః
ఆద్భుతాయై నమః
దేవ్యై నమః
యశస్విన్యై నమః
ధాత్ర్యై నమః
సుప్రసన్నాయై నమః 4
శివాయై నమః
సత్యై నమః

ఓమ్ అనేకశక్తిసంయుక్తాయై నమః
చిచ్ఛక్తయే నమః
జగదాత్మికాయై నమః
ఇందిరాయై నమః
చంద్రవదనాయై నమః
ధాన్యాయై నమః
దారిద్ర్యనాశిన్యై నమః
చందనద్రవదిగ్ధాంగ్యై నమః 50
మందహాసాభిహితాసనాయై నమః
విమలాయైనమః
విశ్వజనన్యై నమః
తుష్టిదాయై నమః
పుష్టిదాయై నమః
ధ్రవాయై నమః
శుక్లమాల్యాంబరధరాయై నమః
సర్వోపద్రవనాశిన్యై నమః
న్యగ్రోధనిలయాయై నమః
శాంతాయై నమః 60
బ్రహ్మవిష్ణుశివాత్మికాయై నమః
త్రికాలజ్ఞానసంపన్నాయై నమః
విజయాయై నమః
భువనేశ్వర్యై నమః

ఓమ్ భద్రాయై నమః
మహాకాళ్యై నమః
వైష్ణవ్యై నమః
త్రిలోచనాయై నమః
తరుణాదిత్యసంకాశాయై నమః 70
తప్తచామీకరప్రభాయై నమః
నాదబిందుకళాతీతయై నమః
పంచకోశాంతరాశగాయై నమః
రత్నస్తంభ సమాలంబిలీలా డోలాంతరాయై నమః
దుష్టదూరాయై నమః
దురాచార శమన్యై నమః
దుగ్ధకుండగాయై నమః
వరదాభయ హస్తాబ్జాయై నమః
ప్రణవాధ్యక్షరాత్మికాయై నమః
గాయత్ర్యై నమః 80
వ్యాహృత్యై నమః
సంధ్యాయై నమః
యోగిన్యై నమః
యోగిధారిణ్యై నమః
మత్తహంసవధూమంద గమనాయై నమః
మధిరేక్షణాయై నమః

ఓమ్ సుదత్యై నమః
సుభ్రువే నమః
సుస్తన్యై నమః 90
సువిలోచనాయై నమః
సువాసికాయై నమః
సుశ్రోణ్యై నమః
గౌర్యై నమః
స్వర్గాపవర్గదాయై నమః
గుణత్రయసమాయుక్తాయై నమః
గుణత్రయవివర్జితాయై నమః
సుధాకుంభింబమధ్యస్థాయై నమః
ఓమ్ సూర్యమండలమధ్యగాయై నమః
సుందరీనివహానూన గాన లోలాయై నమః 100
శుభప్రదాయై నమః
సమస్తభక్తసులభాయై నమః
సంసారార్ణవతారిణ్యై నమః
మోహిన్యై నమః
దుర్గమాయై నమః
దుర్గాయై నమః
మీనాక్ష్యై నమః
మోక్షదాయిన్యై నమః 108

శ్రీమత్కామేశ్వరీ దేవతాయై నమః

అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి.

( శ్రీసూక్తముతో కుంకుమ పూజ చేయవలెను )

శ్రీ మత్కామేశ్వరీ దేవతాయై నమః॥ పత్రపుష్పహరిద్ర కుంకుమాక్షతాన్ సమర్పయామి॥

శ్లో॥ దశాంగ గుగ్గులాజ్యాది సుగంధద్రవ్య సన్నిధిం, ధూపం దాస్యామిదేవేశి కామేశీ స్వీకురుష్వతం॥ కర్దమేన ప్రజా భూతా... మాతరం పద్మమాలినీ ॥౧౧॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయై నమః, ధూప మాఘ్రాపయామి ॥శ్లో॥ ఘృతాక్త వర్తిసంయుక్త మశేష ధ్వాంత నాశకం, దీపం దాస్యామ్యహం దేవి కామేశీ ముదితాభవ॥ ఆపస్సృజంతు స్నిగ్ధాని... శ్రియంవాసయ మే కులే ॥౧౨॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయై నమః॥ దీపం దర్శయామి॥ ॥శ్లో॥ పూర్ణచంద్రాననే దేవి కోటిసూర్యసమప్రభే, కామేశ్వరి గృహాణేదం శుద్ధ మా

చమనీయకం॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయై నమః [illegible]
సంతరం ఆచమనీయం సమర్పయామి నైవేద్యం॥ శ్లో॥ నైవేద్యం
షడ్రసోపేతం దధిక్షీరాజ్యసంయుతం నానా [illegible]
సంజీరక మరీచకం, శలాటుకంచమూలాది [illegible]
అన్నం చతుర్విధం రుచ్యం గుడోపర [illegible]
సూపాఢ్యం హేమపాత్రాంతర స్థితం, [illegible]
ముపభుంక్ష్వ ముదాన్వితా ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వ
రేణ్యం, భర్గో దేవస్య ధీమహి, ధియో యోనః ప్రచోదయాత్.
సత్యంత్వర్తేన పరిషించామి॥ [illegible] ...
జాతవేదో మమావహ॥ [illegible] శ్రీమత్కామేశ్వరీ దేవతాయై నమః
మహానైవేద్యం సమర్పయామి॥ ఓం ప్రాణాయ స్వాహా ఓం అపా
నాయ స్వాహా॥ ఓం వ్యానాయ స్వాహా॥ ఓం ఉదానాయ స్వాహా
ఓం సమానాయ స్వాహా॥ మధ్యేమధ్యే పానీయం సమర్పయామి॥
ఉత్తరాపోశనం సమర్పయామి॥ హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ,
ప్రక్షాళయామి, శుద్ధాచమనం సమర్పయామి॥ శ్లో॥ తాంబూలం చ
[illegible] పూగనాగ [illegible], గృహాణ [illegible] కామేశ్వరి
కులేశ్వరి॥ ఆర్ద్రాం యః [illegible]...జాతవేదో మ మావహ
॥౧౪॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయై నమః, తాంబూలం సమర్ప
యామి॥ శ్లో॥ నీరాజనం గృహాణత్వం [illegible] కామేశ్వరీశ్వరీ. [illegible]
మిర మార్తాండ మండలే తే నమో నమః॥ తాంయ ఆవహజాతవేదో
... విన్దేయమ్పురుషానహమ్॥ ౧౫॥ సామ్రాజ్యం భోజ్యం...[illegible]
దీర్ఘ మాయుః॥ సంతత శ్రీరస్తు సమస్తమంగళాని భవంతు, నిత్య
శ్రీరస్తు, నిత్యమంగళాని భవంతు॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయై
నమః॥ కర్పూర నీరాజనం పర్యయామి ॥శ్లో॥ కామేశీ లోకమాత
స్త్వమా శ్రితాభీష్టదాయినీ, పుష్పాంజలిం [illegible]
భక్త్యా సమర్పితం॥ యశ్శుచిః ప్రయతో భూత్వా శ్రీయమ

స్సతతం జపేత్... శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే॥
మంత్రపుష్పం॥ సహస్రశీర్షం దేవం.. సోఽక్షరః పరమ స్వరాట్॥
రాజాధిరాజయ ప్రసహ్యసాహినే ... ఆపోజ్యోతీ రసోమృతం
బ్రహ్మ భూర్భువ స్వరోం॥ జాతవేదసేసున వామసోమమరాతీ
యతోనిదహాతివేదః, సనః పదతిదుర్గాణి విశ్వానా వేవసింధుం
దురితా త్యగ్నిః, తామగ్ని వర్ణాం తపసా జ్వలంతీం, వైరోచనీం
కర్మఫలేషు జుష్టాం, దుర్గాందేవీగ్ం శరణమహం ప్రపద్యే సుతర
సితరసే నమః, అగ్నేత్వం పారయా నవ్యో ఆస్మాన్ స్వస్తిభి
రతిదుర్గాణివిశ్వా, పూశ్చప్పథ్వీ బహులాన ఉర్వీ, భవా తోకాయ
తనయాయ శంయోః, విశ్వానినో దుర్గహాజాత వేదస్సింధుం నవా
వాదురితాతి పర్షి అగ్నే అత్రి వన్మనసాగ్నణానోఽస్మాకం
బోధ్యవితా తనూనాం, ప్యత నాజతగ్ం సహమానముగ్రి మగ్ని
గ్ం హువేమ పరమాథ్సస్థాత్, సనః పర్షదతిదుర్గాణి విశ్వాక్షా
మద్దేతో అతిదురితా త్యగ్నిః, ప్రత్నోషిక మీడ్యో అధ్వరేషు
సనాచ్చ హోతా నవ్యశ్చ సత్సి, స్వాం చాగ్నే తనువం పిప్ర
యస్వా స్మభ్యం చసౌభగ మాయజస్వ, గోభిర్జుష్ట మయుజో
నిషిక్తం, తవేంద్ర విష్ణో రనుసంచరేమ, నాకస్య పృష్ఠ మభిసంవ
సానో వైష్ణవీంలోక ఇహమాదయంతాం, కాత్యాయనాయ విద్మహే
కన్యకుమారి ధీమహి, తన్నోదుర్గిః ప్రచోదయాత్॥ గౌరీ మిమాయ
సలిలానితక్ష త్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ, అష్టాపదీ నవపదీ
బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్॥ శ్లో॥ యోవే వాదౌ
స్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః, తస్య ప్రకృతిలీనస్య యః
పర స్సమహేశ్వరః, ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వ
భూతానాం, బ్రహ్మాధిపతి బ్రహ్మణోధిపతి బ్రహ్మాశివో మేఅస్తు
సదాశివోమ్॥ శ్రీమత్పారమేశ్వరీ దేవతాయై నమః॥ సువర్ణ మంత్ర

భక్తవత్సలే, నమస్తుభ్యం నమస్తుభ్యం నమస్తుభ్యం నమోనమః॥ శ్లో॥ యానికానిచ పాపాని, జన్మాంతరకృతాని చ తానితాని ప్రణశ్యంతు ప్రదక్షిణ పదే పదే, పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః. త్రాహి మామ్ కృపయాదేవి శరణాగతవత్సలా. అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణంమమ, తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష మహేశ్వరి॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయై నమః॥ ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. శ్లో॥ ధనవృద్ధిం ధాన్యవృద్ధిం కులవృద్ధిం కులేశ్వరి, పుత్రపౌత్రాభివృద్ధిం మే సర్వదే సర్వదా కురు. శ్రియం దేహి యశో దేహి జయం దేహి ద్విషోజహి, ఆరోగ్యం దేహి మే దీర్ఘమాయుః పుత్రాంశ్చ దేహిమే. శ్లో॥ రక్షమా మిష్టకామేశి రక్షమాం భువనేశ్వరీరక్షిరక్షాత్మభక్తంమాం రక్షరక్షేష్ట దేవతే॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయైనమః॥ ప్రార్థన నమస్కారాన్ సమర్పయామి॥ దేవసు వామేతాని హవీగ్ం షి భవంతి, ఏతావంతో వై దేవానాగ్ం సవా, సఏవాస్మై సవాన్ప్రయచ్ఛంతే, తయెనంప్రసన్నవంతే రాజ్యాయా, దేవసూరాజా భవతి॥ శ్రీమత్కామేశ్వరీ దేవతాయై నమః॥ ఛత్ర చామరాందోళికాది సమస్త దేవోపచారా స్సమర్పయామి॥ శ్లో॥ యస్యస్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు, న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే తమచ్యుతం॥ మంత్రహీనం, క్రియాహీనం, భక్తిహీనం కులేశ్వరి, యత్పూజితం మయాదేవి పరిపూర్ణం తదస్తుతే అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజయా చ, భగవతి సర్వాత్మకే శ్రీమత్కామేశ్వరీ దేవతా సుప్రీతా సుప్రసన్నో వరదో భూత్వా, మమ ఇష్టకామ్యార్థ సిద్ధిదాస్త్వితి భవంతో బ్రువంతు, మమ ఇష్టకామ్యార్థ సిద్ధిరస్తు దేవస్య అనంతభోగో అస్తు॥ శ్రీకామేశ్వరీదేవతా ప్రసాదం శిరసాగృహ్ణామి॥

శ్రీమత్కామేశ్వరీ వ్రతకల్పం సంపూర్ణం.

# శ్రీకామేశ్వరీ కథా ప్రారంభః

నారద ఉవాచ : శ్లో॥ సర్వ సంపత్కరం నృణాం సర్వాభీష్ట ప్రదాయకం, రహస్యం సర్వపాపఘ్నం పుణ్యం కలియుగేపి వా, సురూపత్వంచ సౌభాగ్యం సౌఖ్యమాయుః ప్రవర్థం ధనధాన్య సమృద్ధిశ్చ సుపుత్ర, త్వమవంధ్యతాం, పుత్రపౌత్ర సమృద్ధిశ్చ సుహృద్భ్రాతుర్వి వర్ధనం, కులవృద్ధిమరోగత్వం సన్మానం సర్వ బంధుభిః. యత్రయేన భవేద్దేతద్వ్రతం బ్రూహి మేపితా॥

॥ ౧ ॥

తా. పూర్వమొకప్పుడు నారదుడు సత్యలోకంబున కరిగి నచట తన తండ్రి యగు బ్రహ్మతో నిట్లనియెను. ఓ తండ్రీ, చతురాననా! సమస్త సంపదలను ఇచ్చునట్టియు, సర్వ మనోరథములను చేకూర్చునట్టియు, సర్వపాపములను పోగొట్టునట్టిదియు, పుణ్యప్రద మయినట్టిదియు, కలియుగంబున నుండు పాపములను పోగొట్టునదియు, మంచిరూపమును, సౌభాగ్యమును, సౌఖ్యమును, ఆయువును వృద్ధిపొందించు నట్టిదియును, ధనధాన్య సమృద్ధిని, వంధ్యాత్వమును పోగొట్టి సత్సంతానమును ప్రసాదించునట్టిదియు, పుత్రపౌత్రాభివృద్ధిని, మిత్రులను, సోదరులను వృద్ధిపొందించు నట్టిదియును, బంధుమర్యాదను ప్రసాదించు నట్టిదియును, నగు మంచివ్రతము నొకదానిని నాకు తెలిపి సంతోష పెట్ట వలసినదని కోరెను.

బ్రహ్మోవాచ : శ్లో॥ అస్తివ్రతం మహాభాగ కామేశ్వర్యాః ప్రపూజనం సర్వసంపత్కరం శ్రేష్ఠమఖిలాభీష్టసిద్ధిదం॥ నారద

ఉవాచ; శ్లో॥ కామేశీ నామ సా దేవీ యాదృశీ భువనేశ్వరీ,
బ్రహ్మాణీ వాద సావిత్రీ, గాయత్రీవా రమాథవా భవానీవాథవేం
ద్రాణీ లోకనాథ నమోస్తుతే, జన్మకర్మ ప్రభావాది తస్యాస్సర్వం
వదప్రభో. బ్రహ్మోవాచ: శ్లో॥ కామేశ్వాశ్చరితం పుణ్యం రహస్య
మతిదుర్లభం, మయా సంక్షేపతః ప్రోక్తం సావధాన మనాశ్శృణు,
ఇత్యుక్త్వా తాం నమస్కృత్వా కథాంవక్తుం ప్రచక్రమే ॥ ౨ ॥

తా. ఓ నారదా! వినుము॥ కామేశ్వరీవ్రతమను నొక
మహావ్రతంబు కలదు. దాని వలన మానవుల సమస్త మనోరథము
లు సిద్ధించును, సర్వైశ్వర్యములును కల్గును. అని చెప్పగానే
మరల నారదుడు బ్రహ్మగారి నడిగెను. ఓ తండ్రీ! ఆ కామేశ్వరి
యను దేవి యెవరు? సరస్వతియా, సావిత్రియా లేక గాయత్రియా
లక్ష్మీదేవియా, భవానీ, ఇంద్రాణి మున్నగు దేవతలలో ఆమె
ఎవరో, ఆమె పుట్టుక యెచటనో ఆమె చరితము నెరిగించుమన,
నారదునితో బ్రహ్మగారిట్లనిరి. ఓ నారదా! శ్రీకామేశ్వరీదేవి
చరితము పుణ్యప్రదము, అతిరహస్యము, అతిదుర్లభము. దానిని
నీకు సంక్షేపించి చెప్పెదను గాన సావధాన మనస్కుడవై వినుమని
పలికి ఇట్లు చెప్పదొడంగెను.

శ్లో॥ కైలాసశిఖరే రమ్యే సర్వదేవర్షి సేవితే ద్రుమైర్నిత్య
ఫలైశ్చాపిశోభితే రమ్యదర్శనే, కల్ప నీ పామ్రమాలూర వటాది
ద్రుమసంయుతే, తాత్వికైర్మూర్తిమద్భిశ్చయోగైస్సిద్ధిభిరేవచ,
నిత్యముక్తైశ్చసిద్ధైశ్చ శాంభవైర్నిత్యసేవితే, సమాగతా పితు
ర్గేహాత్పిపాసానుగామినం, సర్వజ్ఞం స్వసమీపస్థం నమస్కృత్వా
సభక్తికం, ఉమాలోకహితార్థాయ పప్రచ్ఛ వినయాన్వితా చంద్ర
శేఖర లోకేశ భూతానుగ్రహకారక జలమానయ మే శీఘ్రం

పిపాసాబాధతే హి మాం, ఇత్యేవం జ్ఞాపితో గౌర్యా శివశ్శ్యాతేన
తత్రైవై, ఆనందవాపీమకరోద మృతాబ్ధిసమాంశుభాం, లోకమాతా
పపౌ క్షీరం దశవారం దశాంజలిం, దశగర్భా బభూవుస్తద్దశాంజలి
మితం పయః, ఏకైకస్యాపిగర్భస్య ఘటీ నవక మంతరం,
అంబికాయా స్సముద్భూత పాదయోరశికాంబికా, చీర్వాణీ చోరుకా
డాగ్రే పేర్వాణీ చోరుమూలయోః, జకుళాలాంబాతు కుచయోః
పృష్టాంతేమెన్ని కాంబికా నాసికాయాంతు ముగ్ధాభూద్ధమ్మిల్లే
కొండవాణికా, కామేశీ నేత్రయోర్జాతా, నాథా హోతేశ్వరః పుమాన్
వీరేశ్వరః పృష్టమూతే సంజాతాః పృథివీతలే, తత్రికామేశ్వరీ
ముఖ్యా సైవ లక్ష్మీ శ్శివాపిసా, సైవ వాగ్దేవతా సైవమాయా సైవే
శ్వరీసుతా, తాసాం శృంగారరంగాణి కల్పితాని పురాపశ, క్రిమ
శస్సైరతం రంగం చిత్రరంగోరురంగకే, మృదురంగం రక్తరంగం
ముక్తారంగాతి రంగకే, పీవరంగం హ్రస్వాంగం విస్మృతం రంగ
మేవ చ, రంగకేళిగతానాం వై వస్త్రాభరణ్యాభరణాని చ, ప్రపంచ
మాతాపితరౌ పేటీభిర్దధతుస్సమం, ఆనందవాపిరాతీరే హరిబ్రహ్మా
దిసేవితే, లీలాడోలోత్సవం చక్రుర్దేవాసుర నరావృతం, హరిద్రా
లేపనాభ్యం గమరోఖిస్సమం ముదా, జలక్రీడాంతథాచక్రుస్సర్వ
తీర్థగతామరైః, బ్రహ్మాండభాండ మధ్యస్థైస్సహదేవీ సమన్వితైః
పీతాంబరధరా స్త్రత్రపుష్పా పచయముంగనాః, కృత్వా జ్ఞాదీని
సంగృహ్య మనోజ్ఞాని ముదాన్వితాః ॥ ౩ ॥

॥తా॥ పూర్వకాలమున రమ్యమగునట్టిదియు దేవతలచే
ఋషులచే సేవించబడు చుండునట్టిదియు, నిత్యపుష్ప నిత్యఫల
యుక్తమగువృక్షములచే వ్యాపించబడి నట్టిదియు, మనోహరమగు
కల్పవృక్షములచేతను కడిమి,మామిడి, వెలగ, మఱ్ఱి మున్నగు

యోగములతోను, సిద్ధులతోను జీవన్ముక్తులగు మహర్షులతోను, శివభక్తులతోను నిండియున్న కైలాసశిఖరమందు పితృగృహమగు హిమాలయములనుండి అపుడే వచ్చిన పార్వతీదేవి, దప్పికతో కూడుకున్నదై సర్వజ్ఞుడును తనసహచరుడును యగు సమీపము నందే యున్న తన భర్తయగు ఈశ్వరుని లోకహితార్థమై భక్తితో వినయపూర్వకముగా ఇట్లు ప్రార్థించెను. ఓ చంద్రశేఖరా, విశ్వేశ్వరా! సమస్త భూతములను అనుగ్రహించేవాడా! నాకు మిక్కిలి దాహమగుచున్నది, కాన త్వరితముగా జలమునుగొని తెమ్ము. అని పార్వతిచే ఆజ్ఞాపించబడిన శివుండు తన త్రిశూల ముచే అచటనే త్రవ్వి ఆనందవాపిని చేసెను. అమృతమువంటి జలముగల ఆ నూతిలోని జలమును పదిదోసిళ్ళు పదిసార్లు ఆ పార్వతి త్రాగెను. అందువలన ఆమెకు పదిగర్భములు కలిగెను. ఒక్కొక్క గర్భమునకు తొమ్మిది ఘడియలు వ్యవధానము కలిగి యుండెను. అపుడు ఆ పార్వతి పాదములనుండి రశికాంబికయు, తొడలనుండి చీర్వాణియు, ఊరుమూలములనుండి పేర్వాణియు, స్తనములనుండి జక్కులాంబయు, వక్షోంతమునుండి మెన్నికాంబి కయు, ముక్కునుండి ముగ్ధయు, కొప్పునుండి కొండవాణికయు, నేత్రములనుండి కామేశ్వరియు, నాభినుండి పురుషుడగు పోతేశ్వ రుండును, పృష్ఠమూలమునుండి వీరేశ్వరుండును ఆవిర్భవించిరి. వీరిలో కామేశ్వరీదేవియే ప్రముఖమైనది. ఆమెయే లక్ష్మి, పార్వతి సరస్వతి, మాయ, ఈశ్వరి అని పిలవబడుచుండును. వీరికి పది శృంగారరంగములు గూడా కల్పించబడినవి. 1. సైకతరంగము 2. చిత్రరంగము 3. ఊరురంగము 4. మన్దురరంగము 5. రక్త రంగము 6. ముక్తారంగము 7. అతిరంగము 8. పీతరంగము 9. హ్రస్వరంగము 10. విస్మృతరంగము అనునవి. ఇట్టి రంగములయందు విహరించు దేవతలకు, వస్త్రములను ఆభరణముల

నుగూడ పార్వతీపరమేశ్వరులు పెద్దైలకొలంది సమకూర్చిరి. వీరికి ఆనందవాపీతీరమున బ్రహ్మ, విష్ణువు మున్నగుదేవతలందరును లీలాడోలోత్సవములను జరిగించిరి. అది దేవతలకు మానవులకు గూడా అద్భుతముగా నుండెను. దేవతాస్త్రీలు, అప్సరస్త్రీలు మున్నగు వారందరూ ఈ దేవతలకు పసుపు, నల్లుబిండి మున్నగు నవి, పూసి అభ్యంగనస్నాన మొనరించిరి. జలక్రీడలను గావించిరి. దేవతాస్త్రీలతో గూడి యీదేవతలందరూ, పుష్పాపచయ మొనర్చి, తామరపువ్వులు మున్నగు మంచి మంచి పూలను కొప్పు లయందుంచమర్చిరి.

శ్లో॥ తత్పుష్పాంచితధమిల్లా ఘటికాపూరితోదకాః, వసంత కేళిం చక్రుస్తాః శృంగాదిభిరతంద్రితాః. నానాపుష్ప రసైస్సార్థం నానారత్న సమన్వితైః, బహిర్గత్వా తతశ్శీఘ్రమేకా కామేశ్వరీ స్వయం, వటవృక్షం సమారూఢస్సంది శ్యాత్మసహోదరీః, కాశీ రామేశ్వరగయాకాంచ్యాది స్థానకాన్ప్రతి, సమాసీయ చ తత్ర త్యదేవతాస్సకలాస్స్వయం, తాభిస్సంసే వితానిత్యం లోకరక్షణ లోలుపా, ప్రభుత్వం సర్వలోకానాం యయాచే పితరౌసుతా, అభి సంద్యాధపితరౌ సుతాందుహితృవత్సలౌ, బ్రహ్మశక్తిసమాయుక్తాం విష్ణుశక్తి సమన్వితాం, శివశక్తి సమాయుక్తాం కృత్వాచక్రతు రీశ్వరీం, కులేశ్వరీం మనుష్యాణాం ఈప్సితార్థప్రదాయినీం, తథా ప్రభృతిసాదేవీశక్తిత్రయ సమన్వితా, పూజ్యతే సర్వదా దేవైః భక్తాభీష్ట ప్రదాయినీ, కలౌ పాపౌఘబహుళే నరాణాం దుష్టచేతసాం దురాచారరతానాం చ దుష్టానాం చ దురాత్మనాం, బ్రహ్మఘ్న నాంకులఘ్నానామపి సంరక్షణాయ సా, జాగర్తిభూతలేనిత్యం కామేసిబద్ధకంకణా ॥౬॥

తా॥ కొమ్మలు పిచికారీలు మున్నగు వాటితో జలమును గ్రహించి పుష్పరసముల గ్రహించియు వసంతోత్సవ మాచరించిరి. ఆ సమయమున కామేశ్వరీదేవి కొంతదూరము వెళ్ళి అచట మఱ్ఱి వృక్షమునెక్కి కూర్చుని తన సోదరీలనందరినీ, యితర దేవతాస్త్రీల నందరినీ, కాశీ, రామేశ్వరం, గయ, కాంచీ మున్నగు పుణ్యస్థలము లనుండి అచట దేవతలనందరినీ రప్పించి తాను లోకరక్షణ యందు అభిలాష గలదై పార్వతీ పరమేశ్వరులను తనకు సర్వలోక ప్రభుత్వమిమ్మని కోరెను. అందుకు తల్లితండ్రులగు పార్వతీ పరమేశ్వరులు చాల సంతసించి దుహితృవాత్సల్యముచే వారు ఈ కామేశ్వరీదేవికి బ్రహ్మశక్తిని, విష్ణుశక్తిని, శివశక్తిని ప్రసాదించి మానవుల సమస్తకోరికలనూ సిద్ధింపజేయు కులేశ్వరినిగా అనుగ్రహించిరి. అప్పటినుండియూ ఆ కామేశ్వరీదేవి శక్తిత్రయముతో కూడుకున్నదై దేవతలచేతనూ మానవుల చేతను గూడా భక్తాభీష్ట ప్రదాయిని అని కొనియాడబడుచున్నది. పాపాత్ములకు నిలయమును, దుష్టచేతస్కులు, దురాచారరతులు బ్రహ్మహత్యాది సమస్త పాతకములను చేయువారు, కులములను హింసించువారు అగు నరులకు యీ కలియుగమందు భక్తులగు మానవుల సమస్త పాపములను పోగొట్టుటకై బద్ధకంకణయై యీ కామేశ్వరీదేవి నిత్యము జాగరూకతతో నిలిచియున్నది..

శ్లో॥ తస్యాః ప్రపూజనం పుణ్యం కలావపివిశేషతః, పరస్త్రీ సక్తమనసాం పరద్రవ్యాభిలాషిణాం, నాస్తికానాంచ మూఢానాం గతిః కామేశ్వరీ స్మృతాం ॥౨॥

తా॥ అట్టి కామేశ్వరీదేవి పూజ చాలా పుణ్యప్రదము. మరియు ఈ కలియుగములో తరచు పరస్త్రీల యందాసక్తి కల

వారున్నూ, పరద్రవ్యాభిలాషులున్నూ, నాస్తికులు, మూఢులును
యగు మానవులు హెచ్చుగానుందురు. అట్టివారిని తరింపజేయు
టకు ఈ కామేశ్వరీపూజయే ముఖ్యమగు గతి అయివున్నది......

నారదఉవాచ : శ్లో॥ తత్పూజనం కథం కార్యమాత్మ భక్తైః
కలౌ ముగే, తద్విధానం మమాచక్ష్వ తతలోక పితామహ॥

బ్రహ్మోవాచ : శ్లో॥ ఉత్తరాయణగే భానౌ మకరస్థేదివాకరే
ఆద్యంతయోశ్శుభాదినం శుక్ల పక్ష విశేషతః, భార్గవేందుబుధాదిత్య
గురూణామేవవాసరే, యథామనోహరం భక్త్యా యథానిర్దిష్ట మాత్మని
తథైవానూనమాబాలమా వృద్ధాన్ బాంధవైస్సహా, ప్రాతస్నాత్వా
శుచిర్భూత్వా కామేశ్యా వ్రతమాచరేత్, స్వశక్త్యైవసువర్ణేన రౌప్య
తామ్రాదికేనవా, సహజానప్తకయుతాం సోదరద్వయసంయుతాం,
ఏలాడోలామధ్యగతామశక్తశ్చేత్సుదారుణా, కామేశ్వర్యా కృతిం
కుర్యాద్విత్తశాఠ్యం నకారయేత్॥ స్వగృహస్యోత్తరే దేశేమంటపం
కారయేతతః, తన్మధ్యే త్రిదళంపద్మంయవైర్వా తండులైశ్శుభైః
॥౬॥

తా॥ అప్పుడు నారదుడు తండ్రియగు బ్రహ్మగారిని అడుగు
చున్నాడు. ఓ లోకపితామహా! తండ్రీ! కలియుగము నందలి
మానవులు తరించుటకు ఆ కామేశ్వరి నెట్లు పూజింపవలయును? ఆ
విధానమును నాకు సెలవిమ్ము అని అడుగగా బ్రహ్మగారిట్లు
చెప్పెను, సూర్యుండుత్తరాయణము నొందియుండగా మకరమాస
మందలి శుక్లపక్ష మందుననూ, శుభకార్యముల అనంతరములందు
న్నూ, ఈ కామేశ్వరీపూజ చేసుకొనుటకు చాల ప్రశస్తమైనది.
ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములు చాల మంచివి. భక్తితో

మనోహరమగునట్లు తనకు సంతోషము కలుగునట్లు, బంధువులతో కూడి మిక్కిలి వైభవముగా కామేశ్వరీపూజను జరిగించవలయును. ప్రాతఃకాలమందు స్నానముచేసి శుచియై కామేశ్వరీ వ్రతము నాచరించవలియును. తనశక్తి ననుసరించి, బంగారము, వెండి, రాగి మున్నగు లోహములచే, కామేశ్వరీదేవిని సోదరసోదరీలతో కూడియుండి విలాసముగా ఉయ్యాలలో మధ్యనున్నదానినిగా నిర్మించి పూజించవలయును. శక్తి లేనిచో మంచిదారువు(కఱ్ఱ)చేతనైననూ కామేశ్వరీ విగ్రహమును నిర్మించుకొనవలెను. లోభత్వము పనికి రాదు. తనగృహమందలి ఉత్తర ప్రదేశమున మండపమునునిర్మించి మండప మధ్యభాగమందు త్రిదశాకృతిగా పద్మముగా నేర్పరిచి యవలచేగాని, తండులములచేగాని మండపము నిర్మించవలెను.

శ్లో॥ ప్రతిమాంతత్ర సంస్థాప్య పూజయేద్బంధుభిస్సహా, శ్వేతగంధాక్షతైః పుష్పైహారిద్రాకుంకుమాన్వితైః, ధూపైర్దీపైశ్చనైవేద్యైర్గుడపిష్టార్ధ్రసూపకైః రంభాఫలైర్నారికేళైరిక్షుఖండైర్గుడోదకైః, యేవమన్యఫలాపూపైర్నైవేద్యం కారయేత్సుధీ, సువర్ణపాత్రే గోధుగ్ధంనిధాయాదాయభక్తితః తదాతదానందసరస్త్రీర్థ ప్రతినిధింసుధీః కృత్వాత్మ బాంధవైస్సార్ధం కుర్యాదవభృథం మునే, వృద్ధాను పూర్వమాబాలం దేవీగానపురస్సరం, శ్రద్ధాభక్తియుతో మర్త్యః పూజాంతే తత్కరోతియః, గంగాది సర్వతీర్థేషు స్నాతో భవతి పుత్రక, తత్పంచ ప్రస్తశాలియవగుడపిష్టాధికంమునే, వృద్ధాను పూర్వమాబాలం ప్రత్యేకం మిథునక్రమాత్, దత్తపూర్వం చిరం టిభ్యో భక్షయేద్భక్షితంశుభే త దేవ కామ కామేశి దత్తమిత్యభిభావయేత్, నృత్తగీతైశ్చ వాద్యైశ్చ పురాణపఠనాదిభిః ॥౨॥ ......

తా॥ దానియందు ప్రతిమనుంచి బంధువులతో గూడిన వారై

తలు పసుపుకుంకుమలతో పూజింపవలయును. ధూపములచేతనూ, దీపములచేతనూ, నైవేద్యములచేతను అర్చించవలయును. చలిమిడి వడపప్పు మున్నగువాటిని నివేదించ వలయును. అరటిపళ్ళు, కొబ్బరిఫలములు. చెరకుముక్కలు, పానకము ఇట్లే అప్పములు, పాయసము మొదలగు భక్ష్యములు నైవేద్యము పెట్టవలయును, బంగారుపాత్రయందు ఆవుపాలు పోసి వాటిని గూడ నివేదింపవల యును, అప్పుడప్పుడు ఆనందతీర్థజలము యొక్క ప్రతినిధిగా భావన చేసి పాలతో, భక్తితో, బంధువులతో అవభృథస్నాన మాచరించ వలయును, ఆ బాలస్త్రీవృద్ధులందరునూ దేవిని గూర్చి పాటలు పాడుచూ, పూజాంతమందు భక్తితో శ్రద్ధగా యిట్లు పూజను జరి గించి ఆనందతీర్థ సంబంధమైన గోక్షీరములను బంధు సహితముగా మార్జన చేసుగొనవలయును. ఇట్లు చేసినచో గంగాది సర్వతీర్థ ములయందునూ స్నానమాచరించినంతటి ఫలము నొందుదురు. (ఇట్లు) అయిదుమానికల పిండికి తక్కువ కాకుండా అయిదుకుంచ ముల పిండితో శక్తిననుసరించి చేసిన చలిమిడి ఉండలు చేసి వృద్ధ దంపతులు మొదలుగా వయస్క్రమముగా ఈ చలిమిడి ఉండల నివ్వ వలయును. తరువాత వారివలన యాచించి తాను ఆ చలిమిడిని కొంచెంతీసుకొని, అది కామేశ్వర, కామేశ్వరీదేవతలచే యివ్వబడిన దానినిగా భావన చేసుకుంటూ, తానూ భార్య వగైరా కుటుంబము వారు భక్షించవలెను. ఆ రోజున నృత్తగీతాదులచేతనూ మంగళ వాద్యముల చేతనూ పురాణపఠన శ్రవణాదులతో గడపవలయును.

శ్లో॥ తోషయేద్గణనాతీతాన్ విప్రాన్ దానేన భోజనైః బంధు భిస్స్వజనైః స్సార్థమర్చయేచ్చ సువాసినీః, అథవైకోత్తర శతం చిరంటీనాం కవిద్వయం, తర్పయేదథవాయోషిత్సప్తకం విప్ర

యుగ్మకం, భోజయేద్భక్తిసంయుక్తస్స్వయం ఘంటీత బంధుభిః,
దక్షిణాం చ యథాశక్తి వస్త్రాణ్యాభరణానిచ, దద్యాదిదంయః
కురుతేకామేశీపూజనంమునే, తస్యకార్యాణి సిధ్యంతే నాత్రకార్యా
విచారణా, త్రైలోక్యవిస్తృతంచైవ వ్రతం సర్వవ్రతోత్తమం,
చీర్ణమేతద్వ్రతం సర్వైః పూర్వకల్పే సురాసురైః, శక్రేణాచరితం
పూర్వం వృత్రాసురవధేతథా, అమృతోత్పాదనార్థాయకృతం
దేవాసురైరపి, భగీరథేనతద్వచ్చ గంగామానయతా పురా, రామ
చంద్రేణ తద్వచ్చ సీతాయాః పరిమార్గణే, గోవర్ధనోద్ధరణే
కృష్ణేనాపి మహామునే, కృతం బ్రహ్మర్షిభిస్సార్థకురుత్వమపిభక్తితః,
విజయస్తే భవేన్నిత్యం సర్వలోకేషు నారద ॥౮॥

తా॥ ఆ రోజున పిచ్చేసిన బ్రాహ్మణులను దానములచేతను
భోజనములచేతను సంతోషపెట్టవలయును. తన యింటివారితోను
బంధువులతోను గూడి ఆ రోజున సువాసినీ స్త్రీలను అర్చించవల
యును. నూటఎనమండుగురు పేరంటాండ్రనుగాని, యిద్దరు కవు
లనుగాని, లేక ఏడుగురు ముత్తైదులను, యిద్దరు బ్రాహ్మణులని
గాని ఆ రోజున భక్తితో భుజింపచేయవలయును. అటుపిమ్మట
బంధువులతో భుజించవలయును. పేరంటాండ్రకు వస్త్రములు,
ఆభరణములు, దక్షిణలను యథాశక్తిగ పంచిపెట్టవలయును. ఈ
ప్రకారము ఈ కామేశ్వరీపూజ నెవ్వరు చేయుదురో వారిసమస్త
మనోరథములు సర్వకార్యములు సిద్ధించును. ఇందుకు సందేహ
మేమియూ లేదు. ఈ వ్రతము అన్ని వ్రతములకంటెను చాల
ఉత్తమమైనది. ముల్లోకములయందును ప్రసిద్ధిచెందినది. పూర్వ
కల్పములయందు ఈ వ్రతము దేవతలచేతనూ, అసురులచేతను
గూడ చేయబడినది. వృత్రాసురుని వధించుసమయమున దేవేంద్రు
నిచే యీ వ్రతమాచరింపబడినది. అమృతోత్పాదన సమయమున

దేవాసురులచే ఈ వ్రతమాచరింపబడినది. గంగను భూలోకమునకు తీసుకొనివచ్చునప్పుడు భగీరథుడీ వ్రతమును జేసి కృతార్థుడయ్యెను. సీతాదేవిని వెతుకుచున్న సమయంబున శ్రీరాముడీ వ్రతము నొనరించెను. ఓ నారదా ! గోవర్ధనపర్వతము నుద్ధరించునపుడు శ్రీకృష్ణుడీ వ్రతమును చేసెను. భక్తితో బ్రహ్మర్షులందరితోను నీవుగూడ యీ వ్రతమాచరించుము. సర్వలోకములయందును నీకు విజయము చేకూరును.

శ్లో॥ విద్యార్థీలభతే విద్యాం యశోర్థీ చాప్నుయాద్యశః.
ధనార్థీలభతే విత్తం పుత్రార్థీ లభతే సుతాన్ ॥౯॥

తా॥ మరియు విద్యనుకోరి యీ వ్రత మాచరించిన విద్యలు వచ్చును. కీర్తినిగోరి చేసినచో కీర్తినొందును. ధనమునుకోరి చేసినచో ధనమును, పుత్రులనుగోరి యీ వ్రతమాచరించిన పుత్రులను బొందుదురు. ఇది సత్యము.

శ్లో॥ బ్రాహ్మణక్షత్రియో వైశ్యశూద్రో వాప్యథవా స్త్రియః
భక్త్యా శ్రీకామకామేశీ వ్రతం కుర్యాద్యథావిధి ॥౧౦॥

తా॥ బ్రాహ్మణులుగాని, క్షత్రియులుగాని, వైశ్యులుగాని లేక స్త్రీలుగాని యీ కామకామేశ్వరీ వ్రతమును యథావిధిగా చేసుకొనవచ్చును.

శ్లో॥ కామేశ్వరీ పూజనస్తు గజాం వైశ్వర్యయాప్నుయాత్.
మానవానామిదం పుణ్యం కార్యం సర్వయుగేష్వపి సకలాఘోరే కార్యమేతద్విశేషతః యువవమాచరేద్విద్వాన్ నారీ వా పురుషోపి వా, ఇహభుంక్త్వాఖిలాన్భోగాన్ అంతే కామేశ్వరీం స్మరన్ సువర్ణనవ

రత్నాఢ్యం విమానమధిరుహ్యాచ, గంధర్వైస్సూయమానశ్చ నృత్య ద్భిశ్చాప్సరోగణైః, లోకాలోకమనుప్రాప్య పూజ్యమానా సురాసురైః, కామేశీ నగరం గత్వా కులకోటిసమన్వితః దేవీహాయుజ్య మాప్నోతి పునరావృత్తి వర్జితః ॥౧౧॥

తా॥ ఈ కామేశ్వరీ పూజచేసినవారు గజాంతైశ్వర్యము నొందుదురు. అన్ని యుగములందును మానవులకు ఈ వ్రతము ఉత్తమోత్తమమైనది. కలియుగమునందు యీవ్రతమును తప్పక ఆచరించ తగినది. ఇట్లు పురుషులుగాని, స్త్రీలుగాని యెవరు చేయుదురో వారు ఇహలోకములో సర్వసౌఖ్యములనొంది, అంత్యకాలమున ఈకామేశ్వరీస్మరణకలిగి దానిచే నవరత్న ఖచితమగు బంగారు విమానము నధిష్ఠించి, గంధర్వులచే కొనియాడబడుచు, అప్సరసల నృత్యగీతముల నానందించుచు ఊర్ధ్వలోకముల కరిగి, సురాసురులచే కీర్తింపబడుచు, పునరావృత్తి రహితమగు కామేశ్వరీనగరమును జేరి దేవి సాయుజ్యము నొందెదరు.

శ్లో॥ య ఏవంకురుతే భక్త్యా శ్రావయేద్వాశృణోతివా, సయాతి శాంభవీలోకం జరామరణవర్జితం ॥౧౨॥ ఇతి శ్రీశక్తిపురాణే బ్రహ్మ నారద సంవాదే కామేశ్వరీ వ్రతకథాధ్యాయం సమాప్తము ॥

తా॥ కావున యే మానవులు యీవ్రతమును భక్తి శ్రద్ధలతో చేసెదరో లేక యీ వ్రతకథను సొంతముగా, సావధానముగా విందురో, వినిపించుదురో వారు జరామరణ వర్జితమగుదేవీ లోకము నొందెదరు.

ఇట్లు శక్తి పురాణమందలి నారదబ్రహ్మసంవాద రూపమగు

# శ్రీ కామేశ్వరీ కథపాట

శ్రీ దేవియూ దేవరా వృషనందినెక్కి వయలేరే కైలాస పర్వ
తమ్మునవు హిమవంతమునకేగె ఇటు తిర్గిరాగా అంతలోనే దేవికి
దాహమ్ములాయె, పతితోడా బలికిందీ పడతీ గవరమ్మా, చూడ
వోయి సాంబశివుడా శుద్ధోదాకమ్మూ, అడవిలో దాహంబులై
తేయేలాగూ, చూడవోయి సాంబశివుడా చోద్యంపూ కొలనూ, తన
చేతిశూలానా తనుకొలనూ త్రవ్వి, పాతాళగంగానూ పైకీ
రావించే. ముంచియూ త్రావించే మూడుదోసెళ్ళా, ముంచాతా త్రా
వించే మూడూదోసెళ్ళా, మెంచియూ త్రావించే యేడూ దోసెళ్ళా,
మెంచాతా త్రావించే యేడూదోసెళ్ళా, యేడూనూ మూడూనూ
గర్భంబులాయె, వొక్కొక్క గర్భంబూ తొమ్మిదీ ఘడియలూ,
మనుమాడు పాలకొలనూ. మన మాడీ పాడంగా మనకామూ వెలసే
మనమాడు పాలకొలనూ ॥౧॥ అతివాకూ గర్భిణి లధికమ్ములాయే
అంతలోనా గవరమ్మా వేల్పులాలనడిగే, చిత్రించి తనునడుగా
శ్రీదేవి అప్పుడూ మెఱకతమైతాఁజెప్పె మెలమితో యెరుకా, సిరి
లచ్చిమీ యిళ్ళాచేరనున్నాదీ, సింగారామ్ముగ్గూలూ కోరుతున్నాది.
మాలచ్చిమీఇళ్ళా మసలానున్నదీ, మాణిక్యాలమ్ముగ్గూ కోరూ
తున్నాదీ. శివలక్ష్మి మీఇళ్ళావెలయానున్నాది. చిత్రింపూముగ్గూలూ
కోరుతున్నాదీ. ఆదిలక్ష్మి మీయిళ్ళా నాటా నున్నాది. అక్క
లేద్గురుతోడా నాడానున్నాది, కామమ్మ మీఇళ్ళా గలుగానున్నాదీ,
కడతమ్మూలిద్దరితో గలిసీ వర్ధిల్లూ, మనుమాడు పాలకొలనూ ॥౨॥

శంకీతీబర్కి తానేగా శ్రీదేవి, ఆరిరాళ్ళాబుట్టింది అసిగమ్మా తానూ,
అసిగమ్మాతాగోరె ఇసుకల్లాకొలనూ, చిఱతోడలా బుట్టిందీ చీర్వాణి
తానూ చీర్వాణితాగోరే చిత్రంపూకొలనూ, పెనుతోడలా పుట్టిందీ
పేర్వాణీతానూ, పేర్వాణీతాగోరే పెంపుచౌకమ్మూ, చన్నులా
బుట్టిందే జక్కులమ్మాతానూ, జక్కులమ్మాతాగోరే జమిలీరంగమ్మా

వెన్నూనా బుట్టింది యెన్నెమ్మాతానూ, యెన్నెమ్మా తాగోరే యెర్రాబాణమ్మూ, ముక్కూనా బుట్టిందీ ముద్దరాలూ తానూ, ముద్దరాలూ తాగోరే ముత్యంపూకొలనూ, కొప్పూనా బుట్టిందీ కొండవాజీతానూ, కొండవాజీతాగోరే గొప్పైనాకొలనూ, కన్నూలాబుట్టిందీ కలికీకామమ్మూ, కామమ్మూ తాగోరే కలువాలాచెరువూ, బొడ్డునాపుట్టినాడూ పోతన్నా తానూ, పోతన్నా తాగోరే పొడవైనా కొలనూ, వీపూనాపుట్టినాడూ వీరన్నా తానూ, వీరన్న తాగోరే విస్తారపు కొలనూ, మనమాడు పాలకొలనూ, ॥౩॥ అరికాళ్ళా బుట్టినా అసిగమ్మాతానూ, అసికమ్మాతాగోరే ఇసుకారంగమ్మూ, చిరుతొడరా బుట్టినా చీర్వాణీ తానూ, చీర్వాణీ తాగోరే చిత్రీంపూమ్మగ్గూ, పెందొడలా బుట్టినా పేర్వాణీ తానూ, పేర్వాణీ తాగోరే పెంపూరంగమ్మూ, చన్నూలాబుట్టినా జక్కులమ్మా తానూ, జక్కులమ్మా తాగోరే సన్నావిడిమ్మగ్గూ, వెన్నూనా బుట్టినా యెన్నెమ్మా తానూ, యెన్నెమ్మా తాగోరే యెర్రాబాణమ్మూ, ముక్కూనా బుట్టినా ముద్దరాలూ తానూ, ముద్దరాలూ తాగోరే ముత్యాలామగ్గూ, కొప్పూనాబుట్టినా కొండవాజీతానూ, కొండవాజీ తాగోరే గొప్పారంగమ్మూ, కన్నూలాబుట్టినా కలికీ కామమ్మూ, కామమ్మూ తాగోరే కనకంపూమగ్గూ, బొడ్డూనాపుట్టినా పోతన్నాతానూ, పోతన్నాతాగోరే పొట్టీరంగమ్మూ, వీపూనా బుట్టినా వీరన్నా తానూ, వీరన్నాతాగోరే విస్తారమ్మగ్గూ, మనమాడు పాలకొలనూ ॥౪॥ మునుపూ మూడో నాడూ మునుపూమూ రాత్రీ, పుట్టూతూ అక్కల్లు తేజస్విలైరీ, పుట్టూతూ అక్కల్లూ సొమ్మూలడిగేరూ, దేవిమ్మా దేవారా సొమ్మూ లిచ్చేరూ, తమరూ జన్మించిన నలినాక్షూలారా, మీకై నాకొదవేమీ మేముండాగానూ, శివుడూ తనపట్టెలకూ పట్టూ చీరెల్లూ, తెప్పించీ పెద్ద పెద్ద పెట్టెల్లా నుంచే, శివుడూ తనపట్టెలకూ సర్వాభరణములూ, చేయించీ ఆ

నగలూ భరిణాలానుంచే. మన మాడుపాలకొలనూ ॥౫॥ వలరాచా
అక్కల్లూ కొలనీకొచ్చేరూ, వనరంగా హొసరంగా హొందావహూ
చుంచే. శ్రీరామాలక్ష్మణా సీతాలూగనుచుండా, పూజింపా వోప్పైనా
పుణ్యం పూకొలనూ, శ్రీలక్ష్మికక్కల్లూ శిరసొప్పావనంటి, నైనవాద
ముఖ్యలకూ నలరీ నాకొలనూ, శ్రీలక్ష్మికక్కల్లూ శృంగారావతులూ,
ఆశీర్వదించిన్ని బ్రహ్మాదుల కొలనూ, ఆకాశామొరసేటి యుయ్యాల
కొలనూ, లెండయ్యా పగ్గాలా వేసీరుయ్యాలా, భమిడయ్యా స్తం
భాలా వేసిరుయ్యాలా, బంగారూ పలకల్లూ పైనొప్పుచుండా, బం
ధించిన్ని నవరత్నా ఖచితాపుయ్యాలా, మనమాడు పాలకొలనూ ॥౬॥

అంచు నిర్మలమైనా ఆబ్రహ్మకొలనూ, అక్కల్లూ కొలనాడా
పిలువావచ్చేరూ, దేవీయూదేవారా కొలనాడారమ్మి, శ్రీదేవిభూదేవి
కొలనాడారమ్మి, నందీశా నారదుడా కొలనాడారమ్మి, భృంగీశా
విఘ్నేశా కొలనాడారమ్మి ఆ సూర్యభగవాన్లూ కొలనాడారమ్మి,
వాణీశా కోటీశా కొలనాడారమ్మి, వలరాచా అక్కల్లు కొలనాడా
రమ్మి, వీరన్నా, పోతన్నా కొలనాడారమ్మి, గోవర్ధనపర్వతమూ
గొడుగూగాబట్టి గోపాలాకృష్ణుడా కొలనాడారమ్మి, చల్లానీ మడ
వల్లూ నందిటాబట్టీ చాకలక్కా నీవూ కొలనాడారమ్మి శ్రీరామా
లక్ష్మణులూ కొలనాడారమ్మి సీతామహాదేవీ కొలనాడా రమ్మి,
మనమాడు పాలకొలనూ ॥౭॥

నిమ్మల్లా నీళ్ళల్లా నిలచిందీకొలనూ, దబ్బల్లా నీళ్ళల్లా దనిసిందీ
కొలనూ, వెలగల్లా నీళ్ళల్లా వెలసిందీకొలనూ, చందనా వృక్షములా
చల్లనిదీకొలనూ పన్నెండూకాల్వారా బారిందీకొలనూ, వటవృక్ష
ములా చుట్టూ వరలిందీ కొలనూ, నీలెంచూ కొలనమ్మా పాలెంచూ

కొలనూ, ఆకాన్కరోంయా కొలనూ యెప్పెట్టేదమ్మా, ముత్తెంపూ యీకొలనూ మునిపావాసమ్మా, వజ్రంపూ ఈకొలనూ వట్రూవా యినుకా, శ్రీగంధామి కొలనూ చక్కంగా జేసీ, పన్నీటా ఈకొలనూ వట్రూవాయినుకా, పన్నీటా ఈకొలనూ పచ్చంగా జేసి, ఆ పూదోటలతోటీ అమరిందీ కొలనూ, పోకా బోదెలతోటి పొసగిందీ కొలనూ, అందమైనా పుష్పాలాకూడామల్లా, మట్టాడుమనశ్శూ పొందాడూమీలూ, మనమాడు పాలకొలనూ ॥౮॥

పద్మాక్షిమ్మఅక్క లూ పసపూలాదేరూ, పసుపాడారమ్మనుచూ పఱతీతావిలచే, కొట్టూపసపూ లొపొప్పచేతా బట్టుకొనీ, కోడళ్లూ కొలనాడా వేంచేయారమ్మా, అలయాపసుపూలొప్ప చేతాబట్టుకొనీ, అయిదువలూ కొలనాడా వేంచేయారమ్మా, చాయాపసపూలొప్ప చేతా బట్టుకొనీ, చానాలూ కొలనాడ వేంచెయ్యారమ్మా, ముద్దాపసపూ లొప్ప చేతాబట్టుకొనీ, ముగుదాలూ కొలనాడా వేంచేయారమ్మా, పచ్చిపసపూ లొపొప్ప చేతాబట్టుకొనీ, పడతూలూ కొలనాడా వేం చేయ్యారమ్మా, మనమాడు పాలకొలనూ. ॥౯॥

పద్మాక్షీరక్కల్లూ పసపూలాదేరూ, వాల్పాలూకా మమ్మా వాలూవాలనచూ, వాల్పాలూ అసిగమ్మా వాలూ చీర్పాణీ, వాల్పా లూపేర్వాణీ వాల్లకూల్లమ్మా, వాల్పాలూ యెన్నెమ్మా వాల్మక్షా రాలూ, వాల్పాలూ కొండవాణీ వాలూకామేశీ, వాల్పాలూ పోతన్నా వాలూవీరన్నా, వాల లాడి అక్కల్లూవాలూ వాలనచూ, మనమాడు పాలకొలనూ, ॥౧౦॥

మన్నా బంగారూతూమూ, రాళ్లా పేరేమన్నా వజ్రంపూరాళ్ళా, ఇసుకా పేరేమన్నా వత్రూవాయిసుకా, సేళ్లాపేరేమన్నా కనకోదా కాలూ, శ్రీగంధామీ కొలనూ చక్కనిన్నిరొంపి, పొగడరమ్మా యీ కొలనూ పచ్చనిన్నిధాతూ, ముత్యంపూ యీ కొలనూ మోహంపూ ధాతూ, మనమాడు యీ కొలనూ మనసూరంజిల్లా, కాంతా పేరే మన్నా మురహారీకామూ. మనమాడు పాలకొలనూ ॥ ౧౧ ॥

పద్మాక్షీ అక్కల్లూ పట్టుళ్ళాగట్టీ పేచిరామెలన్నీ యోచించీర పుడూ, అసిగమ్మా కట్టింది ఇసుకల్లా, కొలనూ చీర్వాణీ గట్టింది చిత్రంపూకొలనూ పేర్వాణీగట్టింది పెంపూచౌకమ్మా, జక్కులమ్మా గట్టింది జమిలీరంగమ్మా, యెన్నెమ్మా గట్టింది యెర్రాబాణమ్మా, ముద్దరాలూగట్టింది ముత్యంపూకొలనూ, కొండవాణీగట్టింది గొప్పారంగమ్మా, కామమ్మాగట్టింది కనకాంబారమ్మా, పోతన్నా కట్టినాడూ పొట్టిరంగమ్మా, వీరన్నా కట్టినాడూ విస్తారప్పుకొలనూ, మనమాడు పాలకొలనూ ॥౧౨॥

పద్మాక్షీ కక్కల్లూ పట్టుళ్లాకట్టీ, తోటలకూ వెళ్ళిరీ పువ్వుల్లూ ముడువా, అబ్బిరాగమ్మాలూ కోసేటీవారూ, అబ్బిరాగమ్మాలూ మీ రెంతూరయ్యా, అబ్బిరాగమ్మాలూ కుంచా చేపట్టి అసిగమ్మా కొప్పూ ముడిచేటీవారూ, చిట్టికల్వాపూలూ కోసేటీవారూ, చిట్టికల్వాపూలూ మీ రెంతూరయ్యా, చిట్టి కల్వాపూలూ కుంచా చేపట్టీ, చీర్వాణీ కొప్పూలా ముడిచేటీవారూ, పెద్దకల్వాపూలూ కోసేటీవారూ, పెద్ద కల్వాపూలూ మీరెంతూరయ్యా, పెద్దకల్వాపూలూ కుంచాచేపట్టీ, పేర్వాణీ కొప్పులా ముడిచేటీవారూ, సన్నంపూజాజూలూ కోసేటీ వారూ, సన్నంపూజాజూలూ మీరెంతూరయ్యా, సన్నంపూజాజూలూ కుంచాచేబట్టీ, జక్కులమ్మా కొప్పులా ముడిచేటీవారూ, యర్రా కల్వాపూలూ కోసేటీవారూ యర్రకల్వాపూలూ మీరెంతూరయ్యా

యర్రకల్వాపూలూ కుంచా చేబట్టీ, యెన్నెమ్మా కొప్పులా ముడిచేటీ వారూ, మునుగోరింటాపూలూ కోసేటీవారూ, మునుగోరింటాపూలూ మీరెంతూరయ్యా, మునుగోరింటాపూలూ కుంచాచేబట్టీ ముద్దరాలూ కొప్పులా ముడిచేటీవారు, గొజ్జంగిపువ్వులూ కోసేటీవారూ, గొజ్జంగిపువ్వులూ మీరెంతూరయ్యా, గొజ్జంగి పువ్వులూ కుంచాచే బట్టీ, కొండవాణీకొప్పులా ముడిచేటీవారూ, కనకాంబారమ్మాలూ కోసేటీవారూ, కనకాంబారమ్మాలూ మీరెంతూరయ్యా, కనకాంబా రమ్మాలూ కుంచాచేబట్టీ కామమ్మా కొప్పులా ముడిచేటీవారూ, బొడ్డుమల్లెపూలూ కోసేటీవారూ, బొడ్డుమల్లెపూలూ మీరెంతూరయ్యా బొడ్డుమల్లెపూలూ కుంచాచేబట్టి, పోతన్నా కొప్పులా ముడిచేటీ వారూ, విరజాజీపువ్వులూ కోసేటీవారూ, విరజాజీపువ్వులూ మీ రెంతూరయ్యా, విరజాజీపువ్వులూ కుంచాచేబట్టీ, వీరన్నా కొప్పు లా ముడిచేటీవారూ, మనమాడు పాలకొలనూ ॥ ౧౩ ॥

పద్మాక్షీ అక్కాలూ పువ్వులూ ముడిచీ కొలనాడా వేంచెయ్యా కొనసాగిరప్పుడూ, అందమైనముత్యాలూ కుంచాచేపట్టీ, అనిగమ్మా కొలనాడా వేంచేయ్యారారే, చిన్నాసరి ముత్యాలూ కుంచాచేబట్టి చిర్రావిజీకొలనాడా వేంచేయ్యారారే, పెద్దాసరిముత్యాలూ కుంచా చేబట్టి పేర్వాజీకొలనాడా వేంచేయ్యారారే, సన్నాపడి ముత్యాలూ కుంచా చేబట్టి, జక్కులమ్మా కొలనాడా వేంచెయ్యారారే. యెన్ని కైనా ముత్యాలూ కుంచాచేబట్టి, యెన్నెమ్మా కొలనాడా వేంచేయ్యా రారే, ముద్దదైన ముత్యాలూ కుంచాచేబట్టి ముద్దరాలుకొలనాడా వేం చేయ్యారారే, గొప్పసరి ముత్యాలూ కుంచాచేబట్టి, కొండవాణి కొండవాణి కొలనాడా వేంచేయ్యారారే ఘనమైనాముత్యాలూ కుంచా చేబట్టి, కామమ్మా కొలనాడా వేంచేయ్యారారే, పొట్టిసరి ముత్యాలూ కుంచాచేబట్టి పోతన్నా కొలనాడా వేంచెయ్యారారే, విస్తారం

పద్మాక్షి అక్కల్లూ పువ్వుల్లూముడువా, పోతన్నా తా వెన్నె ఘడియల్లూ ముంచా, అజ్జారాగమ్మూలూ మాచేతూలోవీ, అజ్జారాగమ్మూలూ మీరెంతూరయ్యా, అజ్జారాగమ్మూలూ కుంచాచేబట్టీ, అసిగమ్మాతమ్మూడా ముంచవయ్యా ఘడియా, చిట్టికర్వాపూలూ మాచేతూలోవీ చిట్టికల్వాపూలూ మీరెంతూరయ్యా, చిట్టికల్వాపూలూ కుంచాచేపట్టీ, చీర్వాజీతమ్మూడా ముంచవయ్యా ఘడియా, పెద్దాకల్వాపూలూ మాచేతూలోవీ, పెద్దాకల్వాపూలూ మీరెంతూరయ్యా, పెద్దాకల్వాపూలూ కుంచాచేపట్టి, పేర్వాజీ తమ్మూడా ముంచవయ్యా ఘడియా, సన్నంపూజాజులూ మాచేతూలోవీ, సన్నంపూజాజులూ మీరెంతూరయ్యా, సన్నంపూజాజులూ కుంచా చేబట్టి జక్కులమ్మా తమ్మూడా ముంచవయ్యా ఘడియా, యర్రాతామరపూవ్రా మాచేతూలోవీ, యర్రాతామరపూలూ మీరెంతూరయ్యా యర్రాతామరపూలూ కుంచాచేబట్టి. మెన్నెమ్మాతమ్మూడా ముంచవయ్యా ఘడియా, మునుగోరింటాపూలూ మాచేతూలోవీ, మునుగోరింటాపూలూ మీరెంతూరయ్యా, మునుగోరింటాపూలూ కుంచా చేబట్టీ, ముద్దరాలూ తమ్మూడా ముంచవయ్యా ఘడియా, గొజ్జంగిపూపూలూ మాచేతూలోవీ, గొజ్జంగి పూపూలూ మీరెంతూరయ్యా, గొజ్జంగి పూపూలూ కుంచాచేబట్టి, కొండవాజీ తమ్మూడా ముంచవయ్యా ఘడియా, కనకాంబారమ్మూలూ మాచేతూలోవీ, కనకాంబారమ్మూలూ మీరెంతూరయ్యా, కనకాంబారమ్మూలూ కుంచాచేబట్టీ, కామమ్మాతమ్మూడా ముంచవయ్యా ఘడియా, బొడ్డుమల్లెపూలూ మాచేతూలోవీ, బొడ్డుమల్లెపూలూ మీరెంతూరయ్యా, బొడ్డుమల్లెపూలూ కుంచాచేబట్టీ, పోతన్నా తమ్ముడా ముంచూకో ఘడియా, విరజాజీపూపూలూ మాచేతూలోవీ, విరజాజీపూపూలూ మీరెంతూ

ఛమ్మా, విరజాజీ పూపూలా కుంచాచేబట్టి, వీరన్నా కన్నమ్మా
ముంచవయ్యా ఘడియా, మనుమాడు పాలకొలనూ ॥ ౧౫ ॥

అక్కాల్లో పల్కుల మూహూర్తమైతోచీ, పోతన్నా తావెళ్ళే
ఘడియల్లాముంచా తనచేతి కుంచేలూ ధరణిపై నుంచీ, చల్లుపూలా
దేరే సఖియా లేడుగురూ, అజ్జరాగమ్మూలూ మిరుగొలుతూరైనా
అజ్జరాగమ్మూలూ మా చేతూలోవీ, అజ్జరాగమ్మూలూ మిరుగొందూ
రైనా, అనిగమ్మా తమ్మూడా పుచ్చూమీ ఘడియా, చిన్నాసరి
ముత్యాలూ మిరుగొల్తూరైనా, చిన్నాతామరపూలూ మాచేతూలోవీ,
చిన్నాతామరపూలూ మిరుగొందూరైనా చిర్వాణితమ్మూడా పుచ్చూ
మీఘడియా, పెద్దాసరి ముత్యాలూ మిరుగొల్తూరైనా పెద్దా తామర
పూలూ మాచేతూలోవీ, పెద్దా తామరపూలూ మిరుగొందురైనా,
పేర్వాణితమ్మూడా పుచ్చూమీఘడియా, సన్నావిడిముత్యాలూ మిరు
గొల్తూరైనా; సన్నంపూజాజూలూ మాచేతూలోవీ, సన్నంపూజా
జూల్లూ మిరుగొందూరైనా, జక్కులమ్మా తమ్మూడా పుచ్చూమీ
ఘడియా, యెర్నికాముత్యాలూ మిరుగొల్తూరైనా; యెర్రాకలువా
పూలూ మాచేతూలోవీ; యెర్రాకలువా పూలూ మిరుగొందురైనా
యెన్నెమ్మాతమ్మూడా పుచ్చూమీఘడియా, మునుపూగాముత్యాలూ
మిరుగొల్తూరైనా, మునుగోరింటా పూలూ మాచేతూలోవీ, మును
గోరింటాపూలూ మిరుగొందూరైనా, ముద్దరాలూ తమ్మూడా పుచ్చూ
మీఘడియా, గొప్పాసరి ముత్యాలూ మిరుగొల్తూరైనా, గొజ్జంగి
పూవ్వూలూ మాచేతూలోవీ, గొజ్జంగిపూపూలూ మిరుగొందూరైనా
కొలడవాణితమ్మూడా పుచ్చూమీఘడియా, కనకారత్నమ్మూలూ
మిరుకొల్తూరైనా, కలువాపుష్పమ్మూలూ మాచేతూలోవీ, కలువా
పుష్పమ్మూలూ మిరుగొందూరైనా, కాఘమ్మా తమ్మూడా పుచ్చూమీ
ఘడియా పొట్టిసరిముత్యాలూ మిరుగొలూరైనా, బొడ్డుమల్లేపూలూ
మాచేతూలోవీ, బొడ్డుమల్లేపూలూ మిరుగొందూరైనా, పోతన్నా

తమ్ముాడా పుచ్చూమీఘడియా, విస్తారంముత్యాలూ మిరుగొల్లూరైనా విరజాజీపువ్వల్లా మా చేతూలోపీ, విరజాజిపువ్వల్లా మిరుగొందు రైనా, వీరన్నా తమ్ముాడా పుచ్చూమీఘడియా మనమాడు పాల కొలనూ ॥౧౬॥

కామమ్మా తమ్ముాడూ ఘడియల్లా పుచ్చా గ్రకూ్కా నావత్తూరే అక్కాలతి శీఘ్రం. వాల్కామ్మా చెట్టెక్కి వరహారికామూ అందర్నీ కొలనాడతా బిలవాపంపే దేవేంద్రా దేవతలూ కొలనాడా వత్తూరూ, కేశన్నకృత్తిస్థానకానా నెలకొన్నాయట్టీ వ్యాసకాశీకామమ్మా కొలనాడారమ్మీ, కుండలేశాస్థానకానా నెలకొన్నాయట్టీ, వృద్ధగౌతమీ కామూ కొలనాడారమ్మీ, మురుమళ్ళాస్థానకానా నెలకొన్నాయట్టీ తూగుటుయ్యాల కామూ కొలనాడారమ్మీ, వింజరపూస్థానకానా నెల కొన్నాయట్టీ, భారద్వాజకామూ కొలనాడారమ్మీ, కోరంగిస్థానకానా నెలకొన్నాయట్టీ, ఆత్రేయీ కామమ్మా కొలనాడారమ్మీ, చొల్లంగి స్థానకానా నెలకొన్నాయట్టీ, తుల్యాసంగపుకామూ కొలనాడారమ్మీ కోటిపల్లీ స్థానకానా నెలకొన్నాయట్టీ మాతృసంగాపహాకాముా కొల నాడారమ్మీ, ముక్తేశ్వర స్థానకానా నెలకొన్నాయట్టీ ఋణముక్తి పథ కాముా కొలనాడారమ్మీ, బొన్నాడాస్థానకానా నెలకొన్నాయట్టీ బ్రహ్మగుండాలకాముా కొలనాడారమ్మీ, రాజమండ్రిస్థానకానా నెల కొన్నాయట్టీ, కోటిలింగాలకాముా కొలనాడారమ్మీ, కొవ్వూరు స్థాన కానా నెలకొన్నాయట్టి గోపాదాలకామమ్మా కొలనాడారమ్మీ, భద్రా ద్రి స్థానకానా నెలకొన్నా యట్టీ, ఉష్ణకుండాలకామూ కొలనాడా రమ్మీ, పర్ణశాలాస్థానకానా నెలకొన్నాయట్టి పంపాతీరపుకామూ కొలనాడారమ్మీ, రామేశ్వరస్థానకానా నెలకొన్నాయట్టి రామసేతూ కాముా కొలనాడారమ్మీ శ్రీ కాశీస్థానకానా నెలకొన్నాయట్టి భాగీ రథీకాముా కొలనాడారమ్మీ, ప్రయాగాస్థానకానా నెలకొన్నాయట్టి

త్రివేణీ కామమ్మా కొలనాడారమ్మీ, పిఠాపురంస్థానకానా నెలకొన్నా యట్టి పాదగయకామమ్మా కొలనాడారమ్మీ, దాక్షారామం స్థానకానా నెలకొన్నాయట్టి సప్తగోదావరికామూ కొలనాడారమ్మీ, అంతర్వేది స్థానకానా నెలకొన్నాయట్టి వాసిష్ట కామమ్మా కొలనాడా రమ్మీ, రామేశాస్థానకానా నెలకొన్నాయట్టి కౌశికాసంగపుకామూ కొలనాడా రమ్మీ, కాశీంనకురూస్థానకానా నెలకొన్నాయట్టి శీవాడోలాకామూ కొలనాడారమ్మీ, మనుమాడు పాలకొలనూ ॥౧౭॥

భులోకంబున గల్గూ పుణ్యంపూనదులూ కొలనాడా వచ్చిరే కోటానాకోట్లూ పాతాళామునగల్గూ పావనపూ నదూలూ కొలనాడా వచ్చిరే కోటానాకోట్లూ, స్వర్గామందునగల్గూ సరిలేసీనదులూ కొల నాడావచ్చిరే కోటానాకోట్లూ సత్యాలోకమ్మునా సరిలేనీ నదులూ కొలనాడావచ్చిరే, కోటానాకోట్లూ వైకుంఠాపురమునా వెలశీనదులూ కొలనాడావచ్చిరే, కోటానాకోట్లూ బ్రహ్మాండా ఖాండమునా బ్రబ లేనానదులూ కొలనాడావచ్చిరే, కోటానాకోట్లూ, మనుమాడు పాల కొలనూ ॥౧౮॥

కొలనాడి అక్కల్లూ యేమికోరేరూ, యేటేటా పెళ్ళిళ్ళూ కలుగాగోరేరూ, కొలనాడీ అక్కలూ యేమీ కోరేరూ, దినదినమూ శుభయీలూ గలుగాగోరేరూ, కొలనాడి అక్కలూ యేమీ కోరేరూ, కొడుకూలూ, కూతుళ్లూ కలుగాగోరేరూ, కొలనాడీ అక్కలూ యేమీ గోరేరూ, యేటేటా వడుగుళ్ళూ గలుగాగోరేరూ, కొలనాడే అక్కలూ యేమీ కోరేరూ, యేటేటా రంగములూ గలుగా గోరేరూ. కొలనాడీ అక్కలూ యేమీ కోరేరూ, చలిమిడియూ వడపప్పూ కలుగకోరేరూ కొలనాడ అక్కల్లూ యేమి కోరేరూ, పళ్లూ పానకమ్ములూ గలుగా కోరేరూ, కొలనాడి అక్కల్లూ యేమి కోరేరూ, చీరెల్లూ రవికాలూ

యివ్వా కోరేసూ, కొలనాడే అక్కల్లూ యేమి కోరేసూ, దక్షిణా తాంబూలంబివ్వా కోరేసూ, కొలనాపే అక్కల్లూ యేమి గోరేరూ, సన్నంపుచాయపప్పూ కలుగాగోరేసూ, కొలనాడే అక్కల్లూ యేమి గోరేసూ, ఛల్లానీ పందిట్లో నిల్వా కోరేసూ, మనుమాడు పాల కొలనూ ॥ ౧౮ ॥

(షరా) పూర్వ కాలములో ఈ వ్రతము శ్రీరామ చంద్ర మూర్తి వారిచేతనూ, గోపాలకృష్ణమూర్తి వారు మొదలగువారిచే చేయ బడినట్లు వ్రతకథలో చెప్పివున్నారు గాన శ్రీరామ, గోపాలుర నామములు యీపాటయందుదహరించుచుంటిమి. కాన యీ విధము గానే యీ వ్రతమును చేయు కుటుంబయజమానులు మొదలు వారి కుమారుళ్ళ, కోడళ్ళ, మనుమలు మొదలుగాగలవారి నామములు చెప్ప వలెను. ఆ కుటుంబములో ఆడబడుచుల నామములు చెప్పనవస రములేదు) .... .... .... .... ఈకొలనూ పట్టినా కర్తాపేరేమి కర్తసుమీ శ్రీరామచంద్రమూర్తి ఘనుడూనాయన్నా, ఈ కొలనూ పట్టినా అతివాపేరేమి, అతివసూమీ సీతామహాదేవీ ఆరానైదువ్వా. ఈ కొలనూ పట్టినా కర్తాపేరేమి. కర్తసుమీ గోపాలకృష్ణమూర్తి ఘనుడూనాయన్నా ఈ కొలనూ పట్టినా అతివాపేరేమి, అతివసుమీ రుక్మిణీ మహాదేవీ ఆరానైదువ్వా, మనుమాడు పాలకొలనూ ॥ ౨౦ ॥

ఎత్తరమ్మా యీకొలనూ యేడ్వేలూ చేయూ, దించరమ్మా యీకొలనూ దీర్ఘాయువుగానూ, పట్టరమ్మా యీ కొలనూ పదివేలూ చేయూ, దించరమ్మా యీకొలనూ దీర్ఘాయువుగానూ, ముట్టరమ్మా యీకొలనూ మూడువేలూ చేయూ, దించరమ్మా ఈ కొలనూ దీర్ఘా యువుగానూ, పొదరమ్మా యీ కొలనూ పదివేలూచేయూ, విన రమ్మా యీకొలనూ వేనవేలూచేయూ, కొలువరమ్మా యీకొలనూ కోటివేలూ చేయూ, దినదినమూ యీ కొలనూ దీర్ఘాయువునిమ్మా

పుత్రాపౌత్రలనిచ్చూ భోగమ్ములిచ్చూ, ధన కనకావస్తూ వాహ
నములానిచ్చూ, యిహలోకములోకాసుఖమూలానన్నిటినిచ్చూ, పర
లోకాసుఖామూలా పదిలముగా నిచ్చూ, మనుమాడు పాలకొలనూ
మనుమాడిపాడంగా మనకాము వెలసే, మనమెత్తిదించంగా మన
కాము వెలసే, మనమాడు పాలకొలనూ ॥౨౧॥

శ్రీ ముత్యామేశ్వరిపాట సంపూర్ణం.



# శ్రీ మత్కామేశ్వరీ అష్టకము

శ్లో॥ త్రిలోకసంహారి త్రిపురహరమౌళిస్థసుఫణి
ఫణాలగ్నాదిత్యో ఫలవిరచితాం ఘృష్ట్యట్ట కలితాం
త్రివేదాత్మభద్రాం త్రిదశగణవంద్యాం త్రిణయనాం
భజేహం త్వాం కామేశ్వరి సురపురంధ్రీ జనయుతాం॥

శ్లో॥ మహత్తేజోవిష్ఠాపాం మణిఖచితసింహాసనపదాం
భవాంభోధేః కోలాం భువనజనసంరక్షణపరాం
సురశ్రేష్ఠాంభోజేక్షణ నివిడబద్ధాంజలిపుటాం ॥ భజే ॥

శ్లో॥ శుభాకారాం దామోదరహరసుర జ్యేష్ఠ కలితాం
పరాం శ్రీ గౌరీవాక్పరమరమణీమూర్తియుతాం
త్రిలోకేరక్తాం తాం శరణరతనేత్రాంత కలితాం ॥

॥భజేహం॥

శ్లో॥ అవిద్యాపధ్వంసీం హరిమకుటశోభాం చిత్పదాం
పదన్యాయాకారాం దనుజనికరఘ్నాం కలిహరాం
రిపుచ్ఛేదీం ధీరాం మునిజనసహస్రార్చితపదాం

॥భజేహం॥

శ్లో॥ చలన్ముక్తాహారాం సమరరిపుఘోరాం జయకరాం
కళాధారాం హేమాచలనిభ సుధీరాం శుభకరాం
స్థిరాం వీణాతంత్రీక్వణనతర వాద్యోద్భవకరాం

॥భజేహం॥

శ్లో॥ భవచ్ఛేదాసక్తాశ్రితజన సుమందారకలితాం
స్ఫురద్రూపీం వేణీవిజితఘనబృందామఘలతాం
అవిశ్రాంతా శేషాగణితగుణ బృందామనుపమాం
॥ భజేహం ॥

శ్లో॥ మృగాక్షీమవ్యగ్రాం మునిజనహృదబ్జే నివసతీం
కృపాపూర్ణాం లోకాభయకరసమర్థాం సువదనాం
జగద్ధాత్రీం వేదాంతరిత మహిమానం గుణనిధిం
॥భజేహం॥

శ్లో॥ చలద్గంగాభంగోల్లసిత మృదువాల్యాంతవపనాం
అచింత్యామవ్యక్తామసురసురకాంతార్చితపదాం
కృపాలంబాం శోభావిజితరవిచంద్రాం సువదనాం॥
॥భజేహం॥

శ్లో॥ చిరం భుక్త్వా భోగానిహహిపరమాన్ యస్తు మనుజో
విముక్తః కైవల్యం విమలసుఖమిచ్ఛేత్వరతరం
పఠేత్కామేశ్వర్యష్టకమిద ముదారార్థరుచిరం
త్రికాలేష్వేకాగ్రస్సఖలు పురుషో భక్తికలితః

కామేశ్వరి అష్టకం సంపూర్ణం

శ్లో॥ దుష్టజనాభీష్టఘ్నేమిష్టాష్టైశ్వర్యదాయినీం
ఆద్యాం సృష్టిస్థితిలయకర్త్రీం అష్టమశివకన్యకామహం
కలయే ॥ ౧ ॥

శ్లో॥ కళ్యాణగుణసంపన్నాం కారుణ్యామృతసాగరాం
వందారుజనమందారాం వందే కామేశ్వరీం సదా ॥ ౨ ॥

శ్లో॥ కోమలాంగీం హేమవర్ణాం కోటిసూర్యసమప్రభాం
కరుణారససంపూర్ణాం వందే కామేశ్వరీం సదా ॥ ౩ ॥

శ్లో॥ విశ్వరూపిం విశ్వకర్త్రీం విష్ణుబ్రహ్మేశ్వరార్చితాం
విద్యుత్ సూర్యాగ్నినయనాం వందే కామేశ్వరీం సదా ॥ ౪ ॥

శ్లో॥ రమాగౌరీ వాక్స్వరూపాం రక్షోమూల విఘాతినీం
రంగకేళి సమాయుక్తాం వందే కామేశ్వరీం సదా ॥ ౫ ॥

శ్లో॥ స్వభక్త పాపసంఘాత నాశనీం భవమోచనీం
అజ్ఞానాంధతమోహంత్రీం వందే కామేశ్వరీం సదా ॥ ౬ ॥

శ్లో॥ గుణత్రయాత్మికాం లోకజననీం జన్మపావనీం
ఆనందసచ్చిత్స్వరూపాం వందే కామేశ్వరీం సదా ॥ ౭ ॥

శ్లో॥ భక్తాభీష్టప్రదామాద్యాం భర్మడోలాధివాసినీం
భానుకోటిప్రభాయుక్తాం వందే కామేశ్వరీం సదా ॥౮॥

శ్లో॥ సోదరీసోదరయుతాం సురనారీసుసేవితాం
సుఖదాం సుందరాకారాం వందే కామేశ్వరీం సదా ॥౯॥

# కామేశ్వరీ స్తవము

శ్లో॥ మాతా పితా సఖా బంధుసర్వం కామేశ్వరీమతం
తస్యాస్త్వన్యాం నపశ్యామి త్రిలోకేష్వపి దేవతాం ॥ ౧ ॥

శ్లో॥ జగత్కుటుంబినీ లోకజననీ కులదేవతే
కామేశ్వరి నమస్తుభ్యం తారస్వభవాంబుధేః ॥ ౨ ॥

శ్లో॥ త్వమేవపోషకా మాతా పితాచ త్వంకులేశ్వరి
గతిర్మేనాస్తిత్వత్తోన్యా పాహిమామంబ సర్వదా ॥ ౩ ॥

శ్లో॥ త్వత్పాద సేవానిరతం త్వదనుగ్రహకాంక్షిణం
అనాథంపాహి మాం దేవి కామేశ్వరి కులేశ్వరి ॥ ౪ ॥

శ్లో॥ అనాథపాలనపరే ఆశ్రితా మరవల్లికే
అన్యదైవమజానంతం అనాథం పాలయస్వమాం ॥ ౫ ॥

శ్లో॥ రక్షమాం త్వంజగద్ధాత్రీ రక్షమాం కులదేవతే
రక్ష కామేశ్వరీదేవీ త్వదన్యానాస్తిమే గతిః ॥ ౬ ॥

శ్లో॥ ధనవృద్ధిం ధాన్యవృద్ధిం కులవృద్ధిం కులేశ్వరి
పుత్రపౌత్రాభివృద్ధిర్మే సర్వదే సర్వదా కురు ॥ ౭ ॥

శ్లో॥ శ్రియం దేహి యశో దేహి జయం దేహి ద్విషోజహిం
ఆరోగ్యం దేహి మేదీర్ఘ మాయుః పుత్రాంశ్చ దేహిమే ॥ ౮ ॥

శ్లో॥ రక్షమామిష్టకామేశి రక్షమాం భువనేశ్వరీ
రక్ష రక్షాత్మభక్తం మాం రక్షరక్షేష్టదేవతే ॥ ౯ ॥

శ్లో॥ కామేశ్వర్యాస్స్తవం పుణ్యం యేశృణ్వంతిపఠంతియే
తే సర్వే సర్వకార్యాణి ప్రాప్నువంతి నసంశయః ॥ ౧౦ ॥

కామేశ్వరీస్తవం సంపూర్ణం.